ఆంధ్రకేసరి:

# ప్రకాశం జీవితచరిత్రము.



రచయిత:

మల్లాది లక్ష్మీనరసింహశాస్త్రి



ప్రకటనకర్త:

పసుపులేటి బాపిరాజు,

శ్రీసత్యనారాయణపబ్లిషింగ్ హౌస్,

రాజమండ్రి.

1946.

 [వెల 0—8—0

# ముందుమాట

'భారతీయపుణ్యసంతానముల వేఱ పొగడనేల
భరతఖండంబు భువనపావనము గాదె!'

పాఠకమహాశయులారా!

వియన్నదీతీర్థములతో, ధన్యసాధ్వీచరిత్రములతోను పూతమై; మణీనిచయనిధానముతో, మహనీయరాజ్ఞగుణమణుల తోను ఖ్యాతమై, హిమగిరీంద్రమువలనను, పండితస్వచ్ఛ భావంబులవలనను విమలోన్నతంబై, సరసీతతులతోను, జాతి కవిత్వవాఙ్మయముతోను సరసోదరంబై, విభునిబ్రతికించుకొన్న సావిత్రి సీతిబాలికల కుగ్గుపాలుగా భారతీయసంతానములు విజయనంతములై ప్రాచ్యప్రతీచీదేశములం దసమానఖ్యాతి గడించి నిండు వెలుంగుతో భాసిల్లుచున్నా రను మాటను శంకించువా రుండరు.

ఏమయిన నేమి? అట్టిభారత ధాత్రి దాస్యశృంఖలమున కట్టువడి కష్టపరంపరల నందుచుండుట మనము చూచుచునే యున్నాము. దీని కేనాటికైన ముక్తి గలదా? యనుప్రశ్న ప్రజా బాహుళ్యము వేనోళ్ళ నడుగుచున్నది. దానికి సదుత్తరమీయ గల ప్రజ్ఞావంతుడు, ప్రతిభావంతుడు, మేధాశాలి యొక్క డుండితీరవలెను. అట్టి వ్యక్తి, నేడు ప్రపంచ మందలి ప్రజా సందోహముచే జోహారులందుకొన్న మహాత్ముడొక్కడే యని

మానవకోటియంతయు నంగీకరించితీరును. ఒక్కనోటిమీద ఒక్కమాటమీద కోట్లకొలది ప్రజలను నడిపించు రాజకీయ వేత్త యెంతప్రతిభాశాలియైనను, కేవలముభగవంతుడేయైనను ఉపాంగములు లేనిదే యేవిషయముకూడ బహిరంగముగ ప్రచారము సల్పుటగాని, దానిని లోకోద్ధరణప్రక్రియగ నొనర్చుటకుగాని సాధ్యముగాని పని.

అంతటి మహనీయున కుపాంగములే లభింపవా? వెతుక నక్కర లేకయే, పిలువ పేరంటముకాకయే, అవకాశమిసుమంత యైన జారకయే వేలాదిశక్తివంతులాతని గుప్పిటలో నిమిడి తలదాచుకొని, తెలుపి జేసుకొని, నాడుల నాచ్ఛాదించుకొని యించుక తలయెత్తి, ఆమహామహుని యడుగుజాడల నడచి, భరతమాత సేవజేయుటకు అంగలార్చి భారతీయయశశ్చంద్రి కల దశదిశల నింప నడుముకట్టినారు.

అందు తెనుంగుమాగాణనుండి కొన్ని యంకురములు స్వాతంత్ర్యరక్షణక్షేత్రమున మొలకలెత్తి యాజగదేకనాయకుల వాగమృతముచే దోహదము చేయబడి క్రమాభివృద్ధి గాంచి నేడాజగదేకనాయకునంతటివారుగాని, తత్తుల్యులు గాని కాక పోయినను యామహనీయునితోబాటు తమ కీర్తిచంద్రికలను దశదిశలవెలయించుకొన్నవారు. వారాంధ్రదేశమునుద్ధరింపగని మహానాయకులని యాంధ్రులు నమ్మియున్నారు. అట్టివారిలో నేడు ప్రపంచమునంతను మహాసంగ్రామమునచే నూయూగిత లూగించు స్టాలిన్, హిట్లర్ మొదలగు నియంతలవలెనే

తెనుగుదేశమున నొక నిరుపేదకుటుంబములో బుట్టి నేడుమూడు కోట్ల తెనుగుప్రజలచే మన్నన లందు ప్రకాశంపంతులుగారొకరు. ఆతడు నేడు 'ఆంధ్రకేసరి' ప్రస్తుతమా కేసరి భరతమాతృమంత్రిరాజస్థానము జేయుచు శ్రీకృష్ణజన్మస్థానమున బంధింపబడియున్నది. ఆ హార్యాక్షగర్జనలు తెనుగువారికమృతప్రాయములు. నిరంకుశపాలకులకు భయదగర్జనలు ఆ కేసరిచరిత్రమునే మన మిప్పుడు పఠించుచున్నాము.

ఇట్టి మహనీయుల చరిత్రలను జదివిన యాంధ్రబాలకు లంద రాపంచాస్యము వగిది నగుదురా? ఏమో? ఎవరు చెప్పగలరు? ఇంక నెన్ని మృగేంద్రములు జనించినవో! మాకు మాత్రము వందలాదిగ జనించియున్న వని నమ్మకము గలదు. ఏది యెట్లున్నను, ఈ తెనుంగుపంచాస్యముయొక్క జీవితచరిత్రమును తేటతెనుంగులో ప్రచురించుట మావిధియని యెంచి తెలిసినంతవరకుగ్రహించి యాంధ్రులచేతికందించుచున్నాము. మా తెనుగుసోదరులు తెలివితక్కువదనంబుగ నిరసింపక యీ కేసరినామూలాగ్రముగ పరిశోధించి, బరీక్షించి, దాని ప్రతిభను గుర్తించి, యీ మృగనాథుని జీవితపరిమాణువులలో గొన్నింటినైన యీచరణలోనికి దెచ్చు రేని యీమాశ్రమయు గ్రంథరచయితపరిశ్రమయు గొంతవరకు సఫలము కాగలదు.

ఇట్టి జీవితచరిత్రములను మఱికొన్నింటినచిరకాలములో సంపుటములుగ వెలువరింపదలచి యున్నాము. తెనుగుసోదరు లొకించుక ఆదరాభిమానములు జూపిరేని మా ప్రయత్న

ములు ఫలవంతము కాకపోదు. ఇట్టి ప్రతిభావంతుల యమూల్య జీవితాంశములను జీర్ణించుకొని వారి యడుగుజాడలలో నడచిన భరతమాతదాస్యశృంఖలములు కొలదికాలములో వాటంతటవియే విడిపోవుననుటమాత్రము నిస్సంశయము. మా యీ ప్రయత్నము ఫలవంతమై యీమహాత్మాత్రితయమేని తెనుగుప్రజలా నందించిన భారతమాతపుత్రులు ధన్యులగుదురు. మీ ధన్యవాదములను, ఇతోధికప్రశంసలను, అభివాదనముల నందుకొన యత్నించు మాకృషి తెనుగుసోదరుల ప్రోత్సాహ మను ఆలవాలమునందే పెంపొందింపబడవలయును.

తెనుగుబిడ్డలారా!

ఆంధ్రదేశమును నూతనప్రకాశమునకు గొనివచ్చిన ప్రకాశంపంతులుగారి జీవితచారిత్రమును జదివి యానందించుటతోనుపేక్షింపక తెనుగుగడ్డ సజీవమైయున్నదని బ్రతికిచెడిన పాత్రిగ్గౌరవప్రిపత్తుల నేనాటికైన పొందితీరుననిఋజువుచేయుడు! ఆభారమును మీభుజస్కంధములనిడి మేము విరమించుచున్నాము. పునర్దర్శన మచిరకాలములో చేయగలము.

ఇట్లు
ప్రకటనకర్త.

# ఆంధ్రకేసరి

# టంగుటూరి ప్రకాశంగారి

## (జీవితచరిత్ర.)

---

### ఉపక్రమణిక

విశ్వప్రపంచైకవిజ్ఞానఫలదంబు
వేదకల్పక ముద్భవించుపాదు,
సంకల్పమాత్రితక్షణజగన్నిర్మాణచణ
తపోధనుల కాశ్రమపదంబు,
సత్యరక్షాదిదృఢదీక్షితులైన హరి
శ్చంద్రాదు లేలిన నవనభూమి
పరశురామద్రోణపాండవేయాదికాం
డీరవీరుల గన్న వీరమాత,

గాంగలహరీతరంగసంచాళితోచ్చ
మానవాళ్యఘపంకమా మాన్యసీమ
శంకరాదిమతాచార్యజన్మభూమి
భరతఖండంబు భువనైకపావనంబు

శ్రీమంతంబగు నట్టిభరతఖండంబున బుణ్యభూమియని ప్రఖ్యాతినంది చారిత్రిక సువర్ణపథమున గౌతమీ కృష్ణవేణీ

తుంగభద్ర మొదలగు పుణ్యస్రవంతుల పావనోదకంబుల ద్రాక్ష
పాలుగ్రోలి, సారస్వతసర్వాంతవేత్తలగు నన్నయ, తిక్కన
ఎఱ్ఱాప్రెగ్గడలనెడి కవిత్రయ సమ్మాన్యులచే తీర్చి దిద్దబడిన
యక్కరపు టోరవములతో మెల్లమెల్లగ మాటలాడనేర్చి
ఆంధ్రరాష్ట్రస్థాపనాచార్య వర్యుండగు విష్ణువర్ధనుని భుజాపీఠ
మున నిలిచి, ఆంధ్రదేశసేవాపరాయణులైన కృష్ణరాయాది
భూపాల కంఠీరవులచే సకలసంపదలను బొందలి ప్రాచీనాంధ్ర
నౌకానిర్మాణాది పారిశ్రామిక చిహ్నములను చిత్రకళాసంప
దలజాడలను శిల్పవిద్యా ప్రవీణుల చాతురీధురీణతను వెల్ల
డించు పలువిధంబులగు లక్షణసన్నిహితముల జూచి విలపించు
రెండుకోట్లబిడ్డలను గన్న తెలుగుతల్లి ప్రాచ్యప్రతీచీసీమల
నారంభసూరులని యపఖ్యాతినో, ఖ్యాతినో యార్జించుకొన్న
తెలుగుజానపదులలో నాంధ్రాకాశమున నెన్నియో ఆంధ్ర
తార లుద్భవిల్లి యాంధ్రమాత కుశాశీస్సులందు కొనుచు వెల
యుచున్న యీ తెనుంగు మాగాణిలో కొన్ని ఫలవంతమైన
రసాలతరువులు తెనుగురాచబాటలకు వన్నె దెచ్చి తమమనీషా
ప్రతిభావిశేషమున నల్దిశల తేజఃపుంజముల వెలయించుచున్నవ
నుటతిశయోక్తి కాదు

అయిననేమి? నేడీ తారాగణమంతయు సమయమునకు
స్ఫురింపనివిద్య పగిది, కాననప్రదేశమున వెలుగు వెన్నెల
మాడ్కి, శాస్త్రమెఱుంగని వైద్యుని చందంబున, రక్షణములో

నెదిరింపఁజాలని భుజశక్తి పటుత్వము వలెను, మూలము లేని టీకభాతి' సుమపుంజ సమృద్ధముగాని శయ్యావోలె' వాచాలతలే ని పాండితీగరిమయట్లు' సంతతిలేని గృహంబు పోల్కి' మంచి తాంబూలము లేని బోజనముతీరున, భూగర్భమందణంగిన రత్నంబుచాయనుండి తెనుంగు సీమలో మినుకు మినుకు కాంతులను వెదజల్లుచున్నవి.

మనమిపుడందలి యొకరత్నమును హారమంతటనుకల యవెదకి చేతనిడుకొని పరిశోధించి తత్ఫలితమును చూరగొనను న్నాము. ఆ తెనుగుతల్లి కంఠహారమందలి యారత్నమేది? అది ప్రకాశయుతము. చెంగుచెంగున రంగులీను టంగుటూర్యన్వయసంభవము ఆధ్రదేశమున కిశోరావస్థనుండియు నాంధ్రకిశోరముగ వర్తించి తుదకు ఆంధ్రకేసరియై యాంధ్రావనినంతను ఉఱ్ఱూతలూగించినది.



## జననము

''తరువు లతిరసఫలభారగురుత గాంచు
నింగివ్రేలుచు నమృత మొసంగు మేఘు
డుద్ధతులుగారు బుధులు సమృద్ధిచేత
జగతి నుపకర్తలకు నిది సహజగుణము.''

మనయశః ప్రకాశం డగు ప్రకాశము పందొమ్మిదవ శతాబ్దమధ్యకాలమున నవగా 1872 వ సంవత్సరమున ఆగస్టు నెలలో గుంటూరుమండల మందలి వంగోలు తాలూకా వినోదరాజ పాలెమను నొకజనపదంబున జన్మించెను. ఇది వీరి మాతామహస్థలము. తల్లిగారిజన్మభూమి. ఈయన తలిదండ్రులు సామాన్యనియోగికుటుంబమునజన్మించిరి. తల్లిపేరు సుబ్బమ్మ తండ్రినామధేయము గోపాలకృష్ణయ్య వీరు మిగుల నిరుపేదలు.

అట్టి నిరుపేద కుటుంబముననే, నేటి పాశ్చాత్యనియంతలగు హిట్లరు, ముసోలినీ, స్టాలిన్ మున్నగువారివలెనే పూరి కొంపల్లో బుట్టినాడు. ఎట్టితావున జన్మించిననేమి? కాలమెట్లు మారునో దైవమునకు దప్ప నితరులకు దెలియదుగదా! నేటి నియంతలవలెనే ప్రకాశం పంతులుగూడ బాల్యమున కష్టార హితమైన జీవితమునే గడపెను.

అయితే పువ్వుపుట్టినతోడనే వాసన పొడచూపుతుందని పెద్దలన్నారు. ప్రకాశం బాల్యమునుండీ కూడా ఎంత నిరుపేదకుటుంబంలో పుట్టినా, ఆతని నయనయుగంబులో నుట్టిపడే చుఱుకుపాలు, విశాలత్వము, నడిచేటప్పుడు ప్రకృతి సిద్ధంగా చూపే ఠీవి అతడే నాడో లక్షాపది హేనువేల చతురపుమైళ్ళ వైశాల్యము, యారుకోట్ల జనాభా కలిగి, ముక్కారుపంటల

పాలములకు, మునిపల్లెలకు మూలకందమయిన యాంధ్రావని కెన్నడో మహానాయకుడు కాగలడని, నేడు స్వాతంత్ర్య మనుభవించు బిర్లాంకుకన్నను, మొన్నటివరకు స్వాతంత్ర్య వాతావరణమునందు దూగులాడిన బెల్జియం, హాలండ్, డెన్మార్కుల కన్న వైశాల్యములోను, జనాభాలోను పదింతలుగున్నదైన యాంధ్రదేశము నుద్ధరింపగలడను భవితవ్యచిహ్నాలు గానుపించెడివి.

అతడు పుట్టినది నిరుపేదకుటుంబము. తండ్రి గోపాల క్రిష్ణయ్య. వెలుగోటివారియస్టేటులో చిన్నఉద్యోగమునుసంపాదించుకొన్నాడు తాతముత్తాతలనుండి వీరికాపురము గుంటూరుజిల్లాలో నేడు యమ్.యస్.యమ్. రైల్వేలో బెజవాడకు నెల్లూరుకుమధ్యను చిన్న రైల్వేస్టేషనుగనున్న టంగుటూరను గ్రామము గోపాలక్రిష్ణయ్య జరుగుపాటులేక వెంకటగిరిమహారాజావారి ఎస్టేటులో పేష్కారిఉద్యోగమును సంపాదించుకొని జీవయాత్రను గడుపుచుండువాడు. ప్రకాశంపంతులుకు ఇద్దరుసోదరులు, ముగ్గురు సోదరీలు కలరు. పేదకుటుంబమైనా పరువుమర్యాదలకు, మానాభిమానాలకు పుట్టినిల్లయిన వీరి పూర్వీకులు చేయిచాచకుండా గౌరవంగా కాలక్షేపంచేసేవారు. అయితేనేడు కోట్లకొలది జనాభాగల రష్యాకు ఏకైకనాయకుడై నిన్నమొన్నటిదాకా ప్రపంచాన్నంతా గడగడలాడించిన హిట్లరుకుతోకచుక్కగాతోచే స్టాలిన్ జన్మించినది

నిరుపేదకుటుంబమే. అట్టి స్టాలిన్ బాహాబాహి, ముష్టాముష్టి, కచాకచి, జబ్బచరచి, వెన్నుతట్టి, మిన్నువిరిగి మీదపడు తున్నా నిర్లక్ష్యంగా సమరాన్ని సాగించే హిట్లరు పుట్టినది పూటకుతికాణాలేని పేదకుటుంబం కాదా? నిన్నమొన్నటిదాకా జగద్విఖ్యాతిగన్న ఇటలీక ముఖ్యనియంతయైన ముసోలినీ పేద కుటుంబములోనివాడు కాదా?



## విద్యాభ్యాసము.

'మాతేన రక్షతి పితేన హితే నియుంక్తే
కాంతేవ చాభిరమయత్యపనీయ ఖేదం
కీర్తించ దిక్షు విమలాం వితనోతి లక్ష్మీం
కిం కిం న సాధయతి కల్పలతేవ విద్యా"

నిరక్షరాస్యతకు భారతదేశంలో తావులేదని ప్రఖ్యాతి పడినా ఇప్పటికీ నూటికి పదిమందికంటె చదువుకున్నవారు లేరని తెలుస్తుంది. భారతదేశం చదువులసరస్వతికి నిలయమని కళావేత్తల కగ్రస్థానమని, ఆదర్శకప్రాయమై జగన్నుతి గన్న ప్రాచ్యసామ్రాజ్యవైభవము కలదని, ఆచార్యకస్థానమైన నానాకళావిత్తమజ్ఞానసంపత్తి కలదని, అన్యదేశపరిజ్ఞాయత్న సాధ్యముకాని చతురకార్మికవరశ్రీములు కలదని, ప్రబలంబైన

సప్తద్వీపపర్యంతప్రశాంతభూరివాణిజ్యసంభూతి కలదని, ఏసు నకు ముందు ఆరువేలేండ్లమునుపె నాగరకతాగ్రగణ్యమైనదని ఇచటి యాశ్రమవాటిలో మునికోటి శారికాదులను గూడ సామగీతి చదివించు ప్రతిభావంతమని, ఇచటి ఋషిసంతతి విరించినిప్రతిఘటించి నవప్రపంచములను సృజియించు ప్రభావ సంపన్నయుతమని, ఇచటి పరమయోగిజనము సకలలౌకికము లను విజ్ఞానదృష్టితో బరికించు సత్త్వాఢ్యతతో నొప్పారునని, ఇచటి సిద్ధులు జరామరణరోగరహితంబులగు తేజశ్శరీరము లతో చిరకాలము విలసింతురను ప్రఖ్యాతికలదని, శమదమ సత్యదీక్షలు, అహింసయు నిచటిజనులకాజన్మసంప్రదాయసిద్ధ ములని, జగన్నుతి గన్న భారతావనిలో నందు ముఖ్యముగ నాంధ్రావనిలో పురాణవిద్యావ్యాసంగవ్యామోహము లభి వృద్ధిగానున్న కాలములోగూడ విద్యావంతులు తక్కువనియే చరిత్రలు చెప్పుచున్నవి.

ఇరువదవశతాబ్దారంభమునమన దేశమునగూడ పురాణ విద్యావ్యామోహవ్యాసంగములు మిన్ను ముట్టినవి. దానితో మన గురుకులముల ప్రఖ్యాతి సన్నగిల్లినది. మన యార్షవిద్య లడుగంటినవి. వేదవేదాంగవిద్యాపారంగతులైన పండితమ్మ న్యుని పుత్రులుకూడ ఇంగిలీషుభాషాధ్యయనమున కెగబడి నారు. మడిమాన్యము లమ్ముకొని, మానాభిమానములను జంపుకొని ఇక్కడ చదువుతో తృప్తినందక కానిసీమలు కేగి కడగండ్లుపడి వేనకువేలు చదువునారంభించినారు.

అల్లే మనప్రకాశంపంతులు తండ్రి గోపాలకృష్ణయ్య. కుమారుని కైదవయేట అక్షరాభ్యాసమొనర్చి సమీపముగా వుండే వల్లూరనేగ్రామముందు వీధిబడిలో బ్రవేశపెట్టినాడు. ఏదో కొంతఖర్చు కలిసిరావడంకోసం ఓ జందెపు పోచకూడ మెడలో దగిల్చి ఉపనయనము అయిందనిపించాడు ప్రకాశం చురుకైనవాడే, తెలివికలవాడే అయితేం పలక చేతపట్టేవాడు కాడు. అలాగయినా స్కూల్లోమంచి తెలివికలవాడనే పేరు సంపాదించాడు.

తెనుగుదేశంలో అదేమి ఆనమాయితోగాని ధాత నామసంవత్సరం పంచాంగంలో కనబడిదంటే కరువుదేశమంతా ఎగబ్రాకేది. ప్రకాశాని కైదవయేడు వచ్చినప్పుడే దేశములో కాటకం ప్రారంభమైంది. దానిమూలాన్నే ఆతనితండ్రి ఉన్నవూరువిడిచాడు. కొడుకు కొద్దిజ్ఞానం వచ్చిన తర్వాత అక్కడకు దగ్గరగా వుండే అద్దంకి అనే వూరిలో పెద్దఅప్పగారి దగ్గరవుండి, నాలుగోతరగతి చదివాడు. అంతట్లోకే తండ్రికి ఉద్యోగమైంది. నెల్లూరుజిల్లాలో మేనకూరు అనే గ్రామంలో ఆయన యుద్యోగం. అదైనా 8రూపాయిలజీతం. ఆయన 8 గ్రామాలు తిరిగి పన్నులు వసూలుచెయ్యాలి. పిల్ల లెదుగుతున్నారు. చదువుచెప్పించా లెట్లాగైనాకష్టపడి అనితఃకేవిధంగానూ అందకపోయినా యింగ్లీషుచదు.వుందని నాయుడుపేటలో మకాంపెట్టాడు. ఆయన పగలంతా తనపని చూచుకొని

రాత్రికి నాయుడు పేట చేరుకునేవాడు. ప్రకాశం అక్కడ వస్తు వారం చదువుతూండేవాడు.

ప్రకాశం బాల్యంనుంచీకూడా మిగుల స్వేచ్ఛావర్తనుడు. అభిమాని. కార్యశూరుడు. స్వతంత్రవాంఛ అధికం. క్లాసులో చదువుకొనే తోడుపిల్లవాడుగాని, చదువుచెప్పే ఉపాధ్యాయుడుగాని ఏమైనా అన్నారంటే దాన్నికడకంటా చూచేవాడు. ఒకప్పుడీతన్ని నాయుడుపేటస్కూలులో రెండుమూడు సార్లు డిస్మిస్ చేశారు. తండ్రి మళ్ళీప్రాధేయపడి బడిలో చేర్పించాడు. ప్రకాశానికి ఆటలన్నా, పాటలన్నా ఎక్కువయిష్టం. వాటిల్లోఅఖండుడని పేరుపొందాడు. దైవమునకు చూపోవమి తక్కువ. తగిలినవేలుకే తిరిగీ దెబ్బతగులుతుంది

ఏదోవొకవిధంగా నాయుడుపేటలో కాలక్షేపంచేసి పిల్లలకు చదువుచెప్పించుకొనే గోపాలకృష్ణయ్యను నెల్లూరు వారు, అక్కడికి చాలాదూరముగానున్నది, మిగుల మన్యప్రాంతమై యనేకములైన గడ్డువ్యాధుల కాపట్టయిన మర్లాం అనే తావునకు బదిలీచేశారు. కష్టసుఖములు కావడికుండలువంటివి. అయితే ఆమర్లాంలోనే తానుండి కుటుంబాన్ని చదువుకై నాయుడుపేటనుండి కదపకుండా కాలక్షేపంచేస్తున్నాడు గోపాలకృష్ణయ్య. అంతలో తలవనితలంపుగామృత్యుదేవత కృష్ణయ్యగారిని తనవశీలోకి గొనిపోయింది. ప్రకాశంసగర్భులు పితృహీనులయినారు,

ఒక్క విషయం చూడండి. మనం తెలుసుకోలేము గాని యేదైనా చెడ్డ వచ్చిందీ అంటే అది మంచికోసమే వస్తుందని, మంచివచ్చిందంటే దానినంటిపెట్టుకునే చెడ్డవుంటుందని పెద్ద లంటారు. అంతేగాకుండా లోకంలో ప్రతివ్యక్తి గూడా ముందు కష్టాలనుభవిస్తే తర్వాత సుఖించడం పరిపాటు గావస్తూ వేవుంది. అది చాలాచోట్ల మనం చూడొచ్చు. నేటిప్రపంచనియంత లలో నందెలువేసుకున్న స్టాలిన్, హిట్లరు, కెమాల్ పాషా, చర్చిలు మొదలైనవారి కందరికీ ప్రకాశంపంతులుకు వలెనే పితృవియోగం బాల్యంలోనే వచ్చింది.

దైవం ఏదోరూపంగా ఆపత్కాలంలో అడ్డుపడతాడంటారు. ఆపత్కాలంలో అడ్డుపడ్డవాడే మహాబంధువు. గోపాలకృష్ణయ్యగారు మరణించేసరికి ఆయనభార్య నిండుచూలాలు. అట్టికష్టసమయంలో ఆమె సోదరుడు అనగా ప్రకాశం పంతులు మేనమామ ఆతల్లిని, బిడ్డలను తన స్వగ్రామమైన వినోదరాజపాలెం తీసుకొనివెళ్ళినాడు. చదువుపాడైపోయింది. అది సాగే యెత్తులేదు. నిరుపేదరాలైన ఆతల్లి యెట్లు చెప్పించగలదు?

అయితే ప్రపంచంలో మాతృమూర్తికి సాటివచ్చే నిరుపమానమైన వస్తువే లేదు. సుబ్బమ్మగారికొకవంక భర్తృ వియోగభారదుఃఖము వేరొకవంక పిల్లలచదువుసాగేదియెట్లా

అనే విచారభారము, మరొకవంక దారిద్ర్యభారము ఆమె
ను కృంగదీస్తున్నాయి. ఆమె వీటినెంతమాత్రము లక్ష్యము
చేయలేదు. తనబిడ్డల నేవిధంగానైనా విద్యావంతులుగా చె
య్యాలనే ఆమెదృఢసంకల్పం.

దేవుడుకూడా చెయ్యలేనిపనితల్లి తన బిడ్డలపట్ల చేస్తుంది.
ఆమె యనేకవిధము లాలోచించి పట్నమేదైనా చేరాలని
నిశ్చయించుకుంది. అక్కడికి దగ్గరగావున్నది వంగోలె. ఆమె
సాహసించి పిల్లలతో వచ్చేసి వంగోలులో మకాంపెట్టింది. పొ
ట్టగడిచేయెత్తులేనప్పుడు చదువునడిచేదెట్లాయని యాలోచన
చేసిచేసి, ప్రకాశంపంతుల్ని నాల్గవఫారంలో ప్రవేశపెట్టింది.
గౌరవహాని అనిపొరుగునవ్వినా, బంధుగులిదేమనియీసడించి
నా, లెక్కసేయక ఆధీశాలిని వేరుమార్గంలేనందున ఒకభోజ
నపు హోటలుపెట్టి డబ్బుసంపాదిస్తూ దానితో పిల్లలకు చదువు
సాగిస్తూంది. ఆమెధైర్యం ఓర్మి చాల ప్రశంసనీయములు.
తెనుగుదేశంలోని తల్లులందరుకూడా ఇట్టివారేఅయితే బిడ్డల
చదువు కేంకొంజతనస్తుంది.

ఆతల్లి చాయలే ప్రకాశంపంతులకు అలవడ్డాయి. ఆత
నిలో సహనశక్తి విపరీతంగావుంది. పట్టుదలకూడా మెండుగా
వుంది అయితే అతడు చిలిపిచునిషే. అల్లరిదిట్టంగాచేసేవాడు.
క్లాసులోకల్లాచురుగ్గావుండేవాడు.వంగోలుమ్యునిసిపల్ స్కూల్

స్కూల్లో కొంతకాలం చదివారు. అక్కడనుంచి మిషన్ స్కూల్లో స్కాలర్‌షిప్ సంపాదించి ఆయిదవఫారం చదవనారంభించారు. వయస్సుకుమించివిద్యా, దాన్ని నెట్టివేసే చురుకూ, దాన్ని తలదన్నే పట్టుదల యివన్నీ ఏకీభూతమై అతణ్ణి పైకి నెట్టుగొస్తున్నాయి.

ప్రకాశంపంతులుకు ఏలాగపట్టుబడ్డదోగాని చదువుకునే రోజుల్లో స్కూళ్ళలో ఉత్సవాలుజరిగే సమయాలలో నాడే నాటకాల్లో మంచిమంచిపాత్రలుధరించి ఉపాధ్యాయులమెప్పు పొందేవారు అంతటితో ఆ నాటకాలుఆడే ప్రత్యేకసంఘాల వారితో గూడి యాదువేషాలువేసి మంచిపేరు తెచ్చుకోనారంభించారు. పోలెండురాజ్యాన్ని నిర్మాణంచేసిన మార్షల్ పిల్సుడుస్కీయిలాగనే విద్యాభ్యాసకాలంలో నాటకాల్లో స్త్రీపాత్రలుధరించేవాడట. ప్రకాశంపంతులుకూడా ఆడవేషాలే వేసేవారు. ఆయా స్త్రీపాత్రల సతినిపుణతతో నిర్వహించి పలువుర గానకళాభిమానులయొక్క, నాట్యకళాపోషకులయొక్క ప్రశంసలనందుకున్నారు.

ఆతని వయసు మార్పులను చెందుతోన్నట్టుగానే జీవితంకూడా మార్పుపొందుతోంది. అప్పటిలో నాట్యకళంటే మంచిఅభిమానంకల యిమ్మానేని హనుమంతరావునాయుడుగారనే యొకయుద్యోగి ప్రకాశంపంతులు ఆడవేషాలుచూసి

బాగా ప్రోత్సహించారు. ఆకాలంలో నాటకాల్లో వేషాలు వేయడమనేది యొకనీచవృత్తిగా తలంపబడేది. అల్లాటి వేమీ లెక్క-సేయనిపప్రకాశంపంతులుకు హనుమంతరావుగారు మంచి హుషారుకలుగజేసారు. ఆసమయంలోనే నాయుడుగారికి రాజమండ్రి బదిలీఅయింది. ఆయన ప్రకాశంపంతుల్ని తనతో రాజమండ్రి తీసుకొచ్చారు.

అది 18౮6వ సంవత్సరం. అప్పటికి ప్రకాశంపంతులికి 14 వ యేడు నడుస్తున్నది. రాజమండ్రిలో మనప్రకాశంపంతులు శ్రీహనుమంతరావు నాయుడుగారింట్లోనే వుండేవారు. అతడు నాయుడూ, ఇతడు బ్రాహ్మడూగదా? పొత్తల్లాకుదిరిందని కుంటిప్రశ్న వెయ్యబోకండి స్నేహానికీ – కళాభిమానిత్వానికీ – జాతిమతకులభేదాలడ్డువస్తాయా? ఎన్నటికీరావు అని ఘంటాపథంగా చెప్పొచ్చును. అంతేకాదు – లక్షలాది ఉదాహరణలు చూపవచ్చును. ఏమంటారు? ఒప్పుకొనితీరండి – తీరాలి. నాయుడుగారు కేవలం నాట్యకళాభిమాని ప్రకాశంపంతులు నాయుడుగార్ని నాటకపాత్రధారణచే మెప్పించారు. అదే నాయుడుగారు ప్రకాశంపంతుల్ని రాజమండ్రిలో స్నేహలతాబంధంతో కట్టివేయుడానికి హేతువైంది.

ఇంకో విచిత్రవిషయంకూడా గమనించండి. ప్రకాశంపంతులు చిన్నతనంచేతో చిలిపితనంచేతో, ఏమో నాయుడు

గారెంత పట్టుబడుతున్నా వినకుండా వంగోలు వెళ్ళిపోడానికి తనబిచాణాతో పడవయెక్కడానికి వచ్చేసరికల్లా రోజూనాలు గుదా ఉదాకావుండేపడవలు అనాడు మూడుగంటలు కాకుండానే రేవునువిడిచిపెట్టాయన్నిమాడా. అంటే పంతులికి పడవ దాటిపోయిందన్నమాట. మళ్ళీ తిరిగి నాయుడుగారింటికి వచ్చాడు. నాయుడుగారు తిన్నిచూసి మహదానందంపొందాడు. ప్రకాశంపంతులుకూడా దేవుడు నన్ను రాజమండ్రిలోనే వుంచాలనేతలంపుతో పడవదాటబెట్టాడు కాబోలని అనుకొని యిక్కడే వుండిపోడానికి నిశ్చయం చేసుకున్నాడు. దైవాజ్ఞ అనుల్లంఘనీయంకదా?

ప్రకాశంపంతు లెంత అల్లరిపిల్లవాడుగాగయ్యాళిగా— ఆకతాయిగా కనుపించేవాడో చదువులో అంతచురుగ్గా వుండేవాడు. 1887 వ సంవత్సరంలో రాజమండ్రిలోనే మెట్రిక్యులేషనుపరీక్షకుచదివి 89 లో ఉత్తీర్ణుడయ్యాడు. చదువుమానడమా — చదవడమా అనే ఆలోచన అప్పటికప్పుడే కలిగింది. కొనసాగుతుందా అనే అనుమానపిశాచం పట్టుకుంది. ఓనాడు నాయుడుగారే యీప్రసంగం యెత్తినువ్వు కాలేజీ చదువు చదవమన్నారు. డబ్బువగైరాలు నేనిస్తానని చెప్పాడు. దాంతో పంతులు రాజమండ్రి ఆర్ట్సుకాలేజీలో యఫ్. ఏ. పరీక్షకు చదువప్రవేశించాడు. ఆసమయంలో మదరాసు రాష్ట్రానికి కొంకప్పుడు గవర్నరుగా పనిచేసినవాడు దక్షిణాఫ్రికాకు పెద్ద

యుద్యోగిగా దొరతనమువారిచే పంపబడినవాడు, ఇప్పుడు కీ॥ శే॥ సర్. కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు పంతులుకి సహపాఠులుగా నుండేవారు. అట్టిసహపాఠకుల సహవాసంలో మెసిలినా ప్రకాశంపంతులు మితవాదివర్గంలో జేరకుండా కరుడుగట్టిన కాంగ్రెసువాది అయినాడంటే ఆశ్చర్యమే పడి తీరాలి.

# 3

## గృహస్థాశ్రమము — ఉన్నత విద్య.

'చాణక్యనీతితారాణగా చంద్రగుప్తాద
 మౌర్యులు దేశ మఱయునాడు
పరహింసవలని దేవత్వమేని త్యజించి
 ఘను డశోకుడు ప్రజన్మనుపునాడు
జాతికవిత్వవిద్యాతత్త్వవర్ధనుం
 డిల హర్షవర్ధనుం డేలునాడు
కాకతీయాదిసత్క్షాత్రవంశప్రభుల్
 నియతి దేశంబు పాలించునాడు

కృషియు నానాపరశ్రమలు వృద్ధిజెంది
నావికావర్తకము మహోన్నతి వహించి

భవ్యవిభవానుభవమున భరతభూమి
నాగరికతకు ప్రథమగణ్యముగ నుండె.'

ఆనాగరికతామహావేశమునకు, అయవిచ్ఛిన్న దేశసౌభాగ్యతాప్రవాహమునకు అడ్డుతగిలి యార్ఘురీవేగము నరికట్టి, ఆభారతీయనాగరికవైభవమును వేరుపోకడలతో మారుత్రోవకు మరలించి భారతీయులకు నాగరికతయే లేదను ప్రవాదమును బుట్టించి, శ్వేతముఖులవలననే మనము నాగరికతను నేర్వగలమను విశ్వాసమును భారతీయులలో కొందరకు గలిగించినది హూణభాషామోహావేశము—దాని ప్రచారకులును ఎంతటిచతురు లైనను, మనీషావంతు లైనను, ఆ యెరలో సులభముగా పడిపోయి, తాత్కాలికభోగలాలసత్వముల కాసించి ఇంగ్లీషుభాషాపాండిత్యవాల్లభ్యమున కెగబడినారు.

ప్రకాశంపంతులుకూడ ఆ వక్రమార్గమునే త్రొక్కినారు. 1889 లో రాజమహేంద్రవరంలో మెట్రిక్యులేషన్ పరీక్ష ప్యాసై ఆమరుసటిసంవత్సరము రాజమండ్రి ఆర్ట్సుకళాశాలలో యఫ్. ఏ పరీక్షకు చదువుచుండగానే అతనికి 19 వ యేట వివాహమయినది. అనగా గృహస్థాశ్రమంలో అడుగు పెట్టినాడు. మేనమామయే తనకూతురైన హనుమయ్యమ్మను కన్యాదానంచేసినాడు. వివాహము పెద్దవైభవంగా జరక్కపోయినా, ఆదంపతులుమాత్రము ఒక్కచోట నిలబడుంటే చూడముచ్చటయ్యేది.

భారతదేశంలో ప్రాచీనసాంప్రదాయమనుసారముగ నవలంబింపబడు మానవజీవితములందలి యాశ్రమభాగములలో గృహస్థాశ్రమము, బ్రహ్మచర్యము తరువాతి రెండవది. అంటే తనతోపాటు వేరొకజీవిని పోషించాలనిదానగూడార్థం. ఇది చాల గౌరవమైన ఆశ్రమము. భారతీయులలో పెండ్లికాని వానిని బ్రహ్మచారిగాడని, సంతానవతికాని స్త్రీని గొడ్డురాలని యెంతో హేళనగాను, నైచ్యంగాను చూస్తారు. అది యీనాటియాచారముకాదు. పెండ్లికై యుబలాటపడనివారు హిందువులలో బహుఅరుదుగా వుంటారు. గృహస్థు కానివారిని నైచ్యంగా చూడడం నాగరికప్రపంచానికి ఆచారమే అయిపోయింది. వాడెంత అప్రయోజకుడైనా, నిర్ధనుడైనా పెండ్లి చేసితీరాలి తనకొడుక్కని ప్రతితండ్రీ విశ్వప్రయత్నంచేస్తాడు. అబద్ధాలాడతాడు. అక్రమాలుచేస్తాడు, రహస్యపన్నాగాలు పన్నుతాడు, ఈనాడు భారతీయగృహస్థులలో వైదాశ్రమపద్ధతులను సక్రమంగా నడిపించేవారు నూటిక నూరుపాళ్ళు పూజ్యమే.

ఇప్పటికాలంలో రాజకీయప్రతిబంధకము వలన నేమి ఒత్తిడివలననేమి, శాసనములవలననేమి గృహస్థాశ్రమధర్మము లతిఘోరంగావున్నాయి. మనపత్రికాశంపంతులు వివాహానంతరం కొద్దికాలంచదివాడుకాని యఫ్. ఎ. పరీక్షలో నుత్తీర్ణుడు కావటంతోనే 'వివాహోవిద్యనాశాయ' అనేసామెత నపలు

పెట్టలేదుగాని, ఆయనమాతృమూర్తి పడే కష్టాలను, తాను వహింపబోయే కుటుంబభారాన్ని నెమరుకు దెచ్చుకొని ధనార్జనచెయ్యాలనే ఊహతో చెన్నపట్టణముచేరి ఫస్టుగ్రేడ్ ప్లీడరు పరీక్షకు చదువ నారంభించి 1893 లో ప్యాసం దుత్తీర్ణుడై రాజమహేంద్రవరంలోనే న్యాయవాదవృత్తి నారంభింప సమకట్టినాడు. 1895లో మరలనొకసారి చదువుమీదకు దృష్టిపోగా న్యాయవాదిగావుండే బి.ఎ పరీక్షకు జదువ నారంభించినాడు. కాని, ఒకవంక వృత్తి విషయములను సవరించుకొనుట, వేరొక వంక విద్యాభ్యాసం సాగుతుందా?

అయితే విద్యకు అంతమనేది వొకటివుందా? జీవితాంతం చదివినా వుంటదు. ఎప్పుడైనా సముద్రమునకు గట్టు కనుక్కోవచ్చునుగాని విద్యాసముద్రానికి కనుక్కోలేము. విద్యాభ్యాసానికి గాని, దాన్ని సుముఖంచేసుకోడానిక్కాని ఆస్థ స్వాస్థలుండాలి. అందుకనే యొక మహామహుడు—

శ్లో॥ ఆస్థయా స్వాస్థయా విద్యా మేధయా కిం ప్రయోజనం,
తావుభౌ యది నోచే చ్చ మేధయా కిం ప్రయోజనం॥

అని వక్కాణించినాడు. ఆస్థయనగా మనము పూర్తిగా అన్నాహారములుగూడా విసర్జించి ఖుందులో నెగ్గితీరాలనే పట్టుదల, స్వాస్థయనగా జరుగుబాటుఇవిరెండూవుంటేబుద్ధితో అవసరమేలేదు. ఈరెండు లేకపోయినా బుద్ధి ఎంతవున్నా

ధిప్ర)యోజనమే తీరాపట్టుకలతో చదవాలని పుస్తకం పట్టు కున్నాళ్ళు చేసరికి ఏదో ఒక కొత్త పార్టీ వస్తుందనుకోండి. వాళ్ళను పొమ్మని చెప్పగలడా? అలాచేసితే వృత్తి సాగదుగదా? ఏంచెయ్యాలి. పుస్తకం మడిచి డస్కు మీద పారేసి వాళ్ళ రికార్డుపరిశీలించాలి. ఎలాసాగుతుంది చదువు. చదువుకి వృత్తికీ లంకెపడదు, అందులోనూ న్యాయవాదవృత్తి కసలేభర్జించదు ప్రీకాశం పంతులు చదువు ఆలాగే ఐంది. అక్కడికీ తెలివైనవాడు కాబట్టి పుస్తకంచేత బట్టకపోయినా ఒకపార్టు ప్యాస య్యాడు. కాని అంతలో చదువుకు స్వస్తి చెప్పాడు.

ఒకమూల సంసారభారం నానాటికీ ఎక్కువౌతోంది. వృత్తిలో నానిమిషమైనా తీరుబాటు లేకుండావుంది. పంతులు సంతానవంతుడవుతున్నాడు. అందుచేత క్రమంగా తనలా బుక్కు లేమిటో, ఆ రికార్డు లేమిటో తప్పవేరు గొడవకు పోవటంలేదు. న్యాయవాద వృత్తి కూడా ఖంజాయింపుగానే చేసేవాడు. 1894 లో మొదలుపెట్టి 1904 వరకు పదేళ్ళు నెలిగించాడు. ఏకేసు పట్టినా గెలుపే. పట్టిందల్లా బంగారమై, ముట్టిందల్లా ముత్యమై అన్నసామెత పంతులు కనువర్తించింది. 'డబ్బురాబడి' కీర్తి కూడా పలుదిశలా అల్లుకుంటోంది

పంతులు లబ్బుగాడు. ఆర్జనచేసేటప్పుడు కోమటివలె గించేవాడు ఖర్చుచేసేటప్పుడు కర్ణుడుగా వర్తించేవాడు.డ

బ్బ నిలువ వెయ్యడమంటే యేమిటో యెరుగడు. ఎప్పటిదప్పు డే వ్యయంచేసేవాడు. ఇలావుండగా 1903 లో ఒక కేసు పట్టు కొని చెన్నపట్టణంవెళ్ళాడు. అప్పుడు మదరాసులో బారిస్టర్ స్వామినాథ అయ్యర్ అనే ఒక న్యాయవాది వుండేవాడు. ఆయనమంచిపేరు పేరుప్రతిష్ఠలు సంపాదించాడు' ఆకేసు అ య్యరుదగ్గరకు తీసిగెళ్ళాడు. కేసంతా బోధపరిచాడయ్యరుకి. ఆసమయంలో ప్రకాశంపంతుల్లో గుప్తమైయున్న మహాశక్తి నయ్యరుగారు గమనించాడు. నాలుగురోజుల్లో పంతులు అయ్యరుఅభిమానాన్ని చూరగొన్నాడు. దానితో స్వామినాథ య్యరు "పంతులూ! నీప్రతిభా విశేషాన్ని నేను తెలుసు గున్నాను. కనుక నీకో మంచిసలహా యిస్తున్నాను. అది కేవ లం సహృదయంతో యిస్తున్నాను. కాబట్టి నీవు తిరుగుమాట చెప్పకుండా ఆపథంగా నడుచుగున్నావంటే నీవు తెనుగు దేశంలోనే కాకుండా ఉత్తరహిందూస్థానమంతటా గొప్పపేరు తెచ్చుకొంటావు" అని అన్నాడు.

అయ్యరుగారూ! తప్పక మీయాజ్ఞ శిరసావహిస్తానని ప్రకాశంపంతులనడంతోటే, మరేమీలేదు. నీవుఇంగ్లండు వె ళ్ళి బారిస్టరుపరీక్ష ప్యాసైరిమ్మని సలహాయిస్తున్నాను. అంతేగా కుండా నీవిందు తప్పక జయమందితీరాలని ఆశీర్వదిస్తున్నాను. నీభవిష్యదభివృద్ధి నాశిస్తున్నానని చెప్పడంతోటే, కమ్యా నేను బాత్తిగా పేదకుటుంబంలోవాడను, ఏదో రెక్కలమీద

ఆర్జించి పైకివస్తున్నాను. ఇంగ్లండువెళ్ళి బారిష్టరు కావాలంటే చాలాడబ్బుండాలి. నాపోటివానికి సాధ్యపడునట్లులేని నిరుత్సాహంకనబరిచాడు. అతడెంతనిరుత్సాహంకనపరిచాడో అయ్యారంత ఉత్సాహం చూపుతూ పంతులుభుజంతట్టి 'సోదరా! నీవు బారిష్టరుకాబోయే సూచనలు నాకు నీముఖమండలంలో గోచరిస్తున్నాయి. నీయొక్క పదాదిసంపాదనైతే యింగ్లండువెళ్ళి కృతార్థుడవైరావచ్చును. ఆరువేలకన్న అధికంగా'దని నొక్కి చెప్పాడు.

ప్రకాశంపంతులు సంపాదనప్పట్లో విశేషిగానే వుంది. ఆతనికి ముగ్గురు పుత్రసంతానం కలిగారు. గృహవ్యయం విస్తారంగా లేకపోయినా విచ్చలవిడిగాను, దర్జాగానుఖర్చు చేసేవాడు. గాబట్టి చేతిలోనిల్వ పైసా లేనిమాట వాస్తవమే. పలుకుబడి మాత్రం ఘున్నగావుంది. పైగా అప్పటికప్పుడే అతడు స్థానిక స్వపరిపాలనాసంస్థలలో పేరుసంపాదించుకుంటున్నాడు. రాజమండ్రి పురపాలకసంఘానికి అధ్యక్షుడు (ఛైర్మను)గా వున్నాడు స్వామినాథన్ గారి ప్రోత్సాహపూరితవాక్యాలతో నతనిలో బారిష్టరుకావాలనే కోరిక రేకెత్తి మరి మూడుమాసాలకే యిగ్లండుకు పయనమయ్యాడు. ఏదైనా ఆవిధంగా కలిసివస్తేనే మనిషి పైకిరావడం.

మదరాసునుండి రాజమండ్రి రావడంతోనే తన యింగ్లండు ప్రయాణాన్ని తనముఖ్యమిత్రులతో చెప్పగా వారు

అయ్యరుగారికంటె ఎక్కువగా ప్రోత్సహించారు. అందులో కొందరు నీవు డబ్బువిషయంలో ఏమీ కష్టాలుపడనక్కరలేదని ఉదారత చూపించారు. ఆవిధంగా ఔదార్యం చూపినవారిలో ప్రథములు రాజమహేంద్రిపురవాసులు. బ్రాహ్మణేతర ప్రముఖులలో ప్రఖ్యాతులైన యిప్పుడు కీ॥ శే కంచుమర్తి రామచంద్రరావుగారు, తర్వాత గంటి లక్ష్మణదాసుగారు, వీరిద్దరు కొక్కి చెప్పటంచేత ఇంగ్లాండుకు వెళ్ళాను.

అక్కడనుంచే రాజమండ్రీ ఛైర్మెన్ పదవికి రాజీనామా ఇచ్చారు. అంతచిన్నవయసులోనే ఇతరమండలాన్నించి వచ్చి కొలదికాలంలోనే రాజమండ్రి పౌరుల నాకర్షించాడంటే ప్రకాశంగారిలో ఏదోయొక్క మహత్తరశక్తి వుందని మనం నమ్మితీరాలి. ప్రతిసంవత్సరం వేసంగి శెలవులలో అనగా జూన్, జులై, ఆగష్టు మూడుమాసాలు ఇంగ్లాండునుంచి రాజమండ్రి వచ్చి ఏవో కొన్ని కేసులుచూచి డబ్బుఆర్జించేవారు. రామచంద్రరావు, లక్ష్మణదాసుగారు ఇంగ్లండులో నతనున్నంతకాలమూ అయ్యే డబ్బు చెరిసగం పెట్టుకున్నారు. ఎలాగైతే నేమి క్రిమినల్ బారిష్టరుపరీక్షలో మొదటివాడుగా నెగ్గారు,

మనప్రకాశంపంతులు మనదేశాన్నుంచి చదువుకోసం ఇంగ్లండువెళ్ళి యచ్చటి పాశ్చాత్యయువతీమణుల ప్రేమకలాపాల్లోబడి ఇక్కడనుంచి సంరక్షకులుపంపేడబ్బంతా స్వేచ్ఛా

విహారాలకు ఖర్చుపెట్టి చివరకు పప్పులో కాలేసి ఏదో కొంత డబ్బిచ్చి యే కేంబ్రిడ్జిలోనో ఓ సుక్కుపట్టా ఒకటి కొని తెచ్చుకొని యీ వాసిగలబడే వన్నెమ్మల్లాగా, లేకపోతే ఎక్కడున్న పెద్దలమాటా పెడచెవిలపెట్టక పెళ్ళాడినపెళ్ళాలమాట మరచిపోయి అక్కడేపాశ్చాత్యయువతినో పెండ్లాడి చదువు గంగపాలుజేసికొని, ఒళ్ళంతాఖరాబుచేసికొని, తుదకు నిర్ధనుడై తనకిక్కడ పెద్దలవల్ల రాబోయే ఆస్తిపాస్తులనుగూడా తనవలపుకత్తెకు రాసేసి యీమెతో స్వదేశానికి దిగుమతియై యిక్కడతను అనుకున్నట్టుగా డబ్బుచిక్కకపోతే, ఆమెకు 'ఏమీ సమాధానం చెప్పలేక నోరు నొక్కబెడితే, ఆమె తన వాత్సల్యానికి తణ్ణి కోర్టుకులాగి ముప్పతిప్పలాబెట్టి మట్టిజెప్పిందాని కంటె మూసింతలు కోర్టుద్వారాలాగి విడాకులిచ్చేసిపోతే నలుగురిలోను తలెత్తుకుతిరగలేక తుదకేదో ఆశ్రయింపుద్వారా పొట్టగడుపుకోడానికి పంపినీఉద్యోగంలో చేరేచవటల్లాగాక తన చదువేమోతానేమో చూచుకొంటూ — గౌరవప్రతిష్ఠలు నిలబెట్టుకొంటూ హిందూదేశగౌరవాన్ని, భారతీయప్రతిష్ఠను నిలబెట్టి, సమయంవస్తే భారతప్రతిభను చూపి బారిష్టరు పరీక్షలో ఉత్తముడుగా నెగ్గినందుకు 500 పౌనులు బహుమానం పొంది స్వదేశంచేరాడు. అనప్పేమందు మిత్రులు పంపిన డబ్బుకొంతమిగిలితే యీవసంతా మట్టిచచ్చారు.

ఇక్కడ ఒక్కవిషయం చెప్పాలి. ఆయేడు బారిష్టరు

పరీక్షలో నెగ్గిన బాచిలో మన ప్రకాశం పంతులుగారితో సరి స్థానగలిగినవారు నృపేంద్రనాధసంన్యాల్. పదవీవ్యామోహ వాంఛాసక్తుడైన యీయన పిదపమిలాను ఇండియా ప్రభుత్వంలో లా మెంబరైనారు. పదవీ వ్యామోహం లేకపోవడమేగాక అకుంఠిత దేశాభిమానం కల మనపంతులు కుక్కకూటికెగబ్రాకక తనమామూలు వృత్తిలోనే ప్రవేశించి గౌరవంగా కాలక్షేపంచేయ నారంభించారు.

మరొక గొప్పవిషయం యిక్కడుదాహరించి తీరాలి. సాధారణంగా ఇండియానుంచి చదువుకోసం ఇంగ్లాండు వెళ్ళిన భారతీయులక్కడ చదువు పూర్తి చేసుకొనో, అసంపూర్తిగానో, ఇంటికి మళ్ళముఖం పట్టేటటప్పుడు నూటికి తొంబది తొమ్మండుగురు విదేశాలనుంచి బంగారంముద్ద పట్టుకొస్తున్నామనే గర్వంతో, మానాభిమానాలు, మంచిచెడ్డలు వదిలిపెట్టేసి, కుక్కల్ని, ఇంకా యేవో వికారపుజంతువుల్ని, ఓ తెక్కల దొరసానిని, వెంటబెట్టుకొనిరావడం మనంచూస్తూన్నాము, వింటున్నాము. వార్తాపత్రికల్లో చదువుతున్నాము. ఇంకా చాలా అపహ్యాస్యపు పనులు చేసేవారూ వున్నారు. కాని మనకది అప్రస్తుతం మనపంతులుగారల్లా గాకుండా యూరపునుంచి తనదేశానికి పయనమయ్యేముందు మునుముందు న్యాయవాదవృత్తికిగాను తనకత్యవసరముగా పనికివచ్చేది పలువిధములైన దేశీయవిదేశీయ సారస్వత చర్చ నియమాంశములను

వెల్లడించేవి, యూరపియనుల ప్రతిభను ప్రకటించేవీ పదివేల రూపాయల ఖరీదైన గ్రంథమండలిని స్వంతవాడకం కోసం ఖరీదుచేశాడు. చేతిలో డబ్బులేకపోయినా అంతడబ్బు ఎల్లా చెల్లిస్తామా అనే భీతాంగం లేకుండా తాను స్వదేశం చేరిన పిమ్మట డబ్బుకట్టే పద్ధతిలో కొన్నాడు.

చూడండి. దీన్నిబట్టి మనప్రకాశంపంతులు ధైర్యమూ సారస్వతాభిమానము, పట్టుదల, దేశాభిమానాలు వెల్లడి కావడం లేదా? అతని భావిజీవితంలోని స్వాతంత్ర్యదీక్ష, భవిష్యన్మార్గంలోని సలలిత్వము గోచరించుటలేదా?

## ౪

### వృత్తి—వైశద్యము—దీక్ష

"గ్రాసము లేక సుక్కిన జరా
కృశమైన విశీర్ణమైన నా
హాసమునైన నష్టరుచియైనను
ప్రాణభయార్తమైన నం
త్రాసమ దేభకుంభపశిత
గ్రహాలాలనశీల సాగ్రహో

గ్రీపరభాస మానమగు
కేసరిజీర్ణతృణంబు మేయునే?"

ప్రకాశంపంతులు స్వదేశంచేరడంతోనే మదరాసు ప్రెసిడెన్సీకి రాజధానీనగరంబైన మదరాసులో కాపురం పెట్ట నిశ్చయించుకొని కుటుంబంతో చేరాడక్కడికి. కొండిచెట్టి వీధిలో 11 నెంబరు ఇల్లు పాలికరూపాయలు బాడుగకుతీసి కొన్నారు. తనవృత్తి వైశద్యమునకు పునాది రాయి నాటారు. 1893 సంవత్సరంలో మదరాసులో ప్రాక్టీసు ఆరంభం. మద రాసులో న్యాయవాదవృత్తికై వెళ్ళే యితరపట్టణ నివాసస్థులైన న్యాయవాదు లాదిలో చాలా అధైర్యంగా వెడతారు. కొందరు కొంతకాలానికి మూటాముల్లె కట్టుకొని యింటి మార్గం పడతారు. కొందరు వెళ్ళినవేళావిశేషం చేత పట్టింది ల్లా బంగారమై అక్కడే స్థిరవాసు లవుతారు. ఇది మామూలుగా సాగుతున్న సాగినవ్యవహారమే.

మరికొందరు తమకు కావలసిన పెద్దన్యాయవాదులు గాని, పెద్దయితరశాఖోద్యోగులుగానివుంటే వారి అపరామికి ఆధారపడి పట్నంజేరుతారు. వేరు కొందరు కొంతకాలంక్రింద న్యాయస్థానములలో, ఇతరతాలూ చిన్నపట్టణాలలో ప్రాక్టీసు చేసుకుంటూ అప్పుడప్పుడు మదరాసులో ఏ పెద్ద న్యాయవాది నైనా ఆశ్రయించి యిక్కడనుండి కొన్నికేసులు తీసుగెళ్ళ

ఆయన కప్పచెప్పి డబ్బంతా ఆయనకే ముట్టచెబుతూ అంగాంగీ భావసంబధం బాగాకలిసినతర్వాత వారి యనుమతిపై పట్నం చేరుకొని ప్రయాసభారంతో వృత్తిని నిలబెట్టుకొంటారు. ఇలా అనేక విధములుగా చేరేవారు చేరుతున్నవారు, చేరి పైనచెప్పిన మాదిరులుగా నయ్యేవారుగాను ఉంటారు.

అంతేగాక మదరాసులో ప్రాక్టీసుచేయడానికి వెళ్ళ దలచినవారు భాగ్యవంతులైతే యెట్లైనా మాభాగే అనేభావ ముతో సంవత్సరానికి సరిబడే సరంజామంతా మూటకట్టుకొని చేరుతారు. అందులోను లోభైతే ముందుగా ఏసాదాకొంప లోనోజేరి, న్యాయస్థానానికి కాలినడకమీదనో, చవకబారు రిక్షాలమీదనో పోతాడు. కాస్తదర్జామనిషైతే మొదట్లోనే ఆర్భాటంగా ఓమేడ అద్దెకుదీసికొని యీఖర్చుపెట్టేదంతా యిక్కడ ప్రాక్టీసువల్ల సంపాదించేదేనని యనుకోడానికి కోర్టుకు పొయ్యేటప్పుడు వచ్చేటప్పుడు కార్లోంమీదనేవస్తూ, విరామ సమయంలో చేతిడబ్బు విరజిమ్మటాలాలంచిలకి, వాటికేఖర్చు చేస్తూవుంటారు.

మనప్రకాశంపంతు లాగమనికల్లో జేబిలోనూచేరడు. తనబుద్ధిచతురత, పట్టుదల ఊతగా చేసుకొని, మహాధైర్యంగా ఓనూనానికి సరిపడ్డ గ్రాసాదికం చేతబట్టుకొని పట్నంచేరాడు. అతనికిక్కడనుంచి కేసులుపంపే బాధ్యకర్లూలేరు. అక్కడ నిర

వాకంచేస్తారు మనకేమనే ఆస్కానాలూ లేవు. అందుచేత ఓమూ మూలుయిల్లు అద్దెకుతీసుకొన్నాడు. అంత మరీలాకాయి లూకాయివ్యాపారం గాకుండాను, మాబరాగాకుండాను వ్యవ హరిస్తూ కోర్టుకుపోవ నారంభించాడు. అతడు మదరాసు ప్రధా న న్యాయస్థానంలో అంచనావేసిచూస్తే ప్రాక్టీసు చేసింది ఆరేళ్ళు. ఈ అనతికాలంలోనే అత డపారముగా ధనార్జన చేశాడు. మంచిదాత చేతిలోవుంటే లేదనేరకంగాడు.జల్సాగా పోయేరక మున్నుగాడు. గౌరవమర్యాదలకు భంగంకలుగకుండా ఒకరి ప్రాధేయతమీాద ఆధారపడకుండా ఒక్క యేడాదిలో "ఫలానా"అని పేరుపడ్డాడు.

అక్కడనుంచి వృత్తిలో మంచి అభివృద్ధి కనుపించింది. ప్రధానన్యాయస్థానం బారులోలెక్కకువచ్చేశాడు. ఒక్కరోజు మనపంతులు కోర్టుకువెళ్ళకపోతే న్యాయస్థానాధిపతు లావప్పు మీాదనుంచి'ఫలానా' వచ్చాడాలేదాయని బారుమీాదకు దృష్టి ప్రసారంచేసేవారు. అయితే యెప్పుడూ న్యాయస్థానానికి గైరుహాజరుకాలేదు. అత డచిరకాలంలోనే మదరాసుబారు సంఘమున కధ్యక్షుడైనాడు. ఇదిచాలా ఆశ్చర్యకరమైన విష యం. ఎందుచేతనంటే ప్రధానన్యాయస్థానమందలిన్యాయవాదు లలో అయ్యర్లు, అయ్యంగార్లు, మొదలియారులు, పిళ్ళెలు హెచ్చుగా ఉంటారు. వారికన్నివిధాలా చేయూతనిచ్చేవారి తాలూకు పెద్దఉద్యోగస్థులు ఉంటారు. అల్లాంటి యేఆసరాగాని

ఆశ్చర్యంగాని లేకుండా యింతస్వల్పకాలంలో భాషాసంఘాధ్యక్షుడు కావడం విశేషమే.

అతడు దానాను ప్రతిష్ఠా, పలుకుబడి, ధనమూ కూడా విశేషంగా గడించాడు. తాను ఏయేపట్టణములలో పేదజీవితం గడిపాడో ఆ యా నగరములందు బ్రహ్మాండమయిన భవనాలను నిర్మించాడు. తన వెనుకటి పరిస్థితులను, చదువుకొనేరోజుల్లో గడపినజీవితాన్ని స్మరణకు దెచ్చుకొని యనేకమంది విద్యార్థులకు సహాయంచేసేవాడు. అతడు నిర్మించిన భవనములలో ముఖ్యమయినవి మదరాసు, నీలగిరి, వంగోలు, రాజమహేంద్రవరములందు కట్టినవి. వానిలో నీలగిరిలోని గోదావరీభవనం మిగుల విశాలమును, రమణీయమునైనది. వంగోలులో తనకు గురువువంటివాడైన యిమ్మానేని హనుమంతరావుగారి జ్ఞాపకార్థము వారి పేర పురమందిరాన్ని కట్టించాడు. ఆసమయంలోనే అతడు లాజర్నలకు సంపాదకుడుగాకూడా పని చేశాడు,

సామాన్యంగా లోకంలో యెంత మనీషావంతుడైన వ్యక్తికైనా వ్రాయడంలోను, వక్తృత్వంలోనూ కూడా ప్రజ్ఞ కలగడం దుర్లభం. అటువంటి వాళ్ళు వేళ్ళమీద లెక్కపెట్టు గలిగేటంత స్వల్పసంఖ్యలో వుంటారు ఒకడు మహావక్తగా ప్రతిభసంపాదించుతే ఆతని వ్యాసరచన గుణింతాలు దిద్దు

కునే వాడీ వ్రాతల్లావుంటుంది. ఒకడు కాగితంమీద కలం పెట్టితే అమోఘంగా వ్రాస్తాడేగాని ఉపన్యాసవేదికపై కెక్కితే కాళ్ళు దడదడలాడతాయి. పదిమందిలో పెదవెత్తలేనట్టుగా వుంటాడు. ఈరెండు విషయాల్లోను ఉద్దండుడు కావడానికి పూర్వజన్మ సుకృతంవుండాలి. మన పంతులుకీ రెండంశాలు లోను మంచిపట్టు. కాకితంమీద కలంపెట్టి వ్రాయడం మొదలెడితే యేవ్రాయసకాడూ అందడు. ఉపన్యాసవేదికపై కెక్కి కంఠాన్ని విప్పాడంటే సింహగర్జనలుగా వుంటుంది వాగ్ధాటి. ఆతడు లాజర్నలుకు సంపాదకుడుగా వుండేటప్పుడు డందులో వివిధ న్యాయస్థానములలోను జరుగు పక్షపాతవాదనలను, అసంబద్ధ రూపణలగు శిక్షాసూత్రములను, ఇంతయేల హైకోర్టుజడ్జీలు ఖాయపరచిన తీర్పులను గూడా బ్రహ్మాండంగా విమర్శించినాడు. ఉపన్యాసమైనా జంకుగొంకులులేవు. ఆ విమర్శనలోగూడా చాలా న్యాయధర్మసూత్రాలను విశేషంగా పాటించేవాడు.

దినములు బాగావుంటే యేంజేసినా తోసుకుపోతుందని, పట్టిందల్లా బంగారమౌతుందని పెద్దలంటారు. పట్టినకేసులను బహుశ్రద్ధగా చూచి పనిచేయడంలో పంతులు పట్టుదలగలవాడు. కేజు పుచ్చుకోనడంలో గూడా పుష్కలంగా పుచ్చుకునేవాడు. కేసు యేమాత్రం అన్యాయమనితోచినా నిష్కర్షగా పార్టీలతో చెప్పేవాడు మీది అన్యాయమని. ఇంకేమాత్ర

మాధారంవున్నా, న్యాయమార్గంగా వుండంన్నా దాన్ని పట్టి పల్లార్చి విజయం పొందేవాడు. ఇది సాధారణంగా ఆవృత్తిలో వున్నవారి కుండడం కష్టం. కొన్ని కేసులు ప్రివికౌన్సిలులప్పలుకు స్వయంగా లండనుకు తీసుకెళ్ళి యచటి వాదనలలో తన ప్రతిభను జూపి జయంపొందేవాడు. ఆతడెప్పుడు ప్రివికౌన్సిలుకు లండను వెళ్ళినా వెస్టుమినిస్టర్ పాలెస్ హోటల్లో బస చేసేవాడు. లండన్లోవుండే అన్ని హోటల్సులోకి మంచిసౌకర్యాలుగల హోటలది.

ఒకప్పుడాతడా హోటల్లో 1913లో బసచేసి వుండగా అందులో నేడు ప్రపంచాని కంతకు గొప్పవాడనిపించుకొంటూన్న గాంధీజికి విందుచేయునేర్పాట్లు బసలోనే జరిగాయి. అయితే మహాత్ముణ్ణంతవరకు ప్రకాశంపంతులు వినడమేగాని చూచియుండలేదు. ఆవిందుమూలాన నచ్చటనే గాంధీని కలుసుకోనడం తటస్థించింది వారిద్దరూ యించుమించు గంటన్నర కాలం మాట్లాడుకున్నారు. గాంధీజీ యప్పటి ప్రకాశంపంతులి చురుకుదనము, విద్యావైశద్యము తెలిసికొన్నాడు.

ప్రకాశంపంతులు తన ప్రాక్టీసుకాలంలో వేలాది కేసులు గెలిపించాడు. వందలాదిగ వేలాదిగ ఫీజు పుచ్చుకొన్నాడు. అయితే ప్రతీకేసూ నెగ్గించవాడు, అతడు మహోద్దండంగా వాదించిన కేసులలో రాజమండ్రి కరెన్సీ కేసు మిగుల చెప్పకొనతగినది. దానియువంతమిది.

ప్రపంచంలో మంచిచెడ్డలు రెండూ అన్నదమ్ములవలె అంటిపెట్టుకునే వుంటాయి. ఆంధ్రదేశంలో చారిత్రాత్మకంగా మహాప్రసిద్ధి నొందిన రాజమహేంద్రవరములో ఇరువదవ శతాబ్దారంభమున నాట్యకళాపోషకుడు, మహాదాత యని ప్రసిద్ధి జెందిన యాంధ్రనియోగి బ్రాహ్మణశాఖయుండేవాడు. ఆపట్టణంలో ప్రజ లాయన్ని పిలిచే బిరుదునామం 'బాబుగారు' వారియింటిపేరు సత్యవోలువారు అపారశాకికులు. ఆయనకు పెద్దలుంచినపేరు గున్నేశ్వరరావు గొప్పపలుకుబడి, దానికి వన్నెదెచ్చే ఉదాత్తత్వము, దానితలదన్నిన దాతృత్వము, అంతకుమించిన దర్జా, దానికిబ్బడిగనున్న ఠీవి యేమానవుడైనాసరే సజ్జనుడైయుంటె మెచ్చుకుతీరవలసిందే! అయితే ఆపరోపకారి, ఆత్యాగశీలుడు, ఆకలియుగదధీచి, ఆయాంధ్రరాధేయుడు, ఆనాట్యకళాపోషకుడు, కుజనులతో గలసి దుండగీండ్రతో చేతులుకలిపి ప్రపంచాన్ని, దొరతనాన్ని కన్నుగప్పి యేదేనా విద్రోహకార్యం చేసాడనికాని, చేయూతనిచ్చాడని కాని అంటె తెనుగు ప్రజలువిశ్వసిస్తారా? ఆయనపేరు నాట్యకళాపోషణ భారదురంధరత్వముననో, విశాలదాతృత్వమహిమమునననో చెప్పబోవుగాని, ఆసుకృతరాసి పవిత్రనామము నెరుంగని యాంధ్రుడుగాని, హైందవుడుగాని, భారతీయుడుగాని, లేడని ఘంటాపథముగా చెప్పవచ్చును. ఇంతయేల పాశ్చాత్య దేశములన్నిటిలోగూడ నా కీర్తి శేషుడను గురుమూరు మోహరించని పెద్దలెందరో చెప్పుచుం

డగా వినియున్నాను. అట్టిపుణ్యాత్ముని కరెన్సీ సృష్టించెనని దొరతన మాయనను నిర్బంధించి న్యాయస్థానమునకు దెచ్చినది.

ఆయన తరుపున మన ప్రకాశంపంతులు తన న్యాయ విద్యాప్రావీణ్యతకు, ధర్మసూత్రములన, శాసనపథకమునకు, తనవాక్చక్యమును పరిణతిగా సమర్చి తనక్లయింటు నిర్దోషి యని వాదించి, యావాదనలో తనయద్భుత మేధావిత్వమును ప్రకటించుకొని యందుజయముపొంది అపారయశమార్జించినాడు. క్రిమినల్ లాయర్సులో సర్వాగణ్యతనొందినాడు. ప్రకాశంపం తులు న్యాయస్థానానికి వెళ్ళేటప్పుడు చూడముచ్చటగా వుం డేది. కానిఆయాకర్ణాంతవిశాలనేత్రాలు,ఆసువర్ణశరీరచ్ఛాయ, ఆరాజఠీవి చూస్తే న్యాయస్థానంలో యెదిరి న్యాయవాదికే గాక న్యాయాధిపతులకు, ప్రేక్షకులకుగూడ భీతాంకురము ప్రభ వించేది. ఆ నీలికాంతులను వెదజల్లు నల్లనిషూట్, శిరస్సుపై నల్లబొచ్చుటోపీ చూస్తేసరి కెట్టివాడైనా దూరంగా తొలగి పోవలసినదే? కాని చిరునవ్వు ప్రసారంచి మేత్రి సమయంలో చూచామా మహదానందంలో మునిగి తేలవలసిందే. ఆయన వెనుక బృహస్పతివలె పాలరంగు సిల్కు సూటుతో సాంబ మూర్తి వెన్నంటి వుండేవాడు.

వేయేల! ప్రకాశంపంతులు తెనుగుదేశమందు పేరువడ్డ న్యాయవాదులలో ప్రథమశ్రేణిలో నెన్నదగినవాడు.

## ౬

## దేశసేవ — ప్రాముఖ్యవిధులు

"క్షీరము మున్నునీటికొస
గెఁ స్వగుణమ్ములు తన్న జేరుటఁ
క్షీరముతప్తమౌట గని
చిచ్చురికన్ స్వతజలంబె, సు
హ్వారసుహృద్విపత్తిగని
వహ్నించొరంజన దుగ్ధమంతలో
నీరముగాంచి శాంతమయి
నిల్చుమహాత్ముల మైత్రి యీగతిఁ."

క్రీ॥ శ॥ 1913 లో మహాత్మునితో మాట్లాడినప్పటి నుండి ప్రకాశంపంతులుకా దివ్యతేజోమయుని రూపము హృదయఫలకంలో నాటుకొనిపోయింది. కాలము గిరగిర తిరుక్కు-పోతుంది. కేలండరులో 19:1 వచ్చింది. దేశమంతటా రాజకీయ వాతావరణంప్రజ్వరిల్లింది. కాని జనసామాన్యంమట్టుకు అందలి సత్యాన్వేషణమును జాడపట్టలేకపోయింది. కాంగ్రెసు సంస్థపేరు యెక్కడచూచినా నగారామోగ్రితవలె ధ్వనిస్తోంది. విద్యార్థులుమాత్రం కొందరు కాంగ్రెసుపథకాన్ని విశ్వసించి

యెప్పుడురుకుదుమా అని ఉవ్విళ్ళూరుతున్నారు. మహాత్ముని స్వరాజ్యశంఖారావము తెనుగు సోదరుల కర్ణపుటము లలో మ్రోగనారంభించినది, అది దేశమంతా ప్రాకిజనపదపరిసరాలకెగబ్రాక సిద్ధముగానున్నది. గాంధీమహాత్ముడు దక్షిణాఫ్రికానుండి విజయవాడకు వేంచేసి దుర్గాదేవి సమ్ముఖాన సత్యాగ్రహసమర శంఖమును మ్రోగించారు. అనేకమంది న్యాయవాదులు అమ్మహానాయకుని మాటలందు విశ్వాసముంచి వృత్తిని విసర్జించి కాంగ్రెసు మహాక్షేత్రమున కరిగినారు. అందులో మన ప్రకాశంపంతులు గారొకరు రెండు చేతులతోను ఆర్జించుకొనే న్యాయవాదవృత్తికి తిలోదకాలిచ్చి కాంగ్రెసుసంస్థలో చేరారు. చేరినది మొదలందులో తాను చేయవలసిన, చేయదగిన, కార్యక్రమము నంచనా వేసుకున్నారు. కాంగ్రెసువాది అయినారు.

అదివరలో అనగా 1919 వ సంవత్సరములో మహానందిక్షేత్రమున జరిగిన ఆంధ్రరాష్ట్రీయ కాంగ్రెసు మహాసభకధ్యక్షత వహించినారు. అప్పటినుండే ప్రకాశం పంతులికి, ఆంధ్రరాష్ట్రోద్యమానికి అవినాభావసంబంధ మేర్పడింది అయినను ఏ కారణంచేతనో ఆతనిదృష్టి, మనీషాధిషణ ఆంధ్రరాష్ట్రాందోళనపై పూర్తిగా లగ్నంకాలేదు. అసలు ఆంధ్రరాష్ట్ర సమస్యయే మన్నుదిన్న పాములా అయింది. అదేందుర దృష్టమోగాని నేటికీ వివిధకష్టపరంపర నందుతోనేవుంది. అది

పరిష్కారమార్గంలోకి రాకపోవడానికి కారణం మనపంతుల్ని రాష్ట్రసమస్య ఆకర్షింపలేక పోయింది కనుకనే. నేటివరకు ఆసమస్య అట్లే నిలచిపోయినది.

మూడుకోట్లకు పైబడిన జనాభాగల ఆంధ్రులు ప్రత్యేక రాష్ట్రంకోసం యెల్లా అల్లాడుతున్నారో దొరతన మింతవరకు గ్రహింపనేలేదు. ఆంధ్రులేమైనా తెలివితక్కువవాళ్ళా? ఆంధ్రదేశంమీద వచ్చే ఆదాయంమాత్రం తక్కువా? ఆంధ్రదేశపు ఆదాయాన్ని ఆంధ్రులకోసమే ఖర్చుపెటుకున్నారా? ఆంధ్రులేమైనా దొరతనానికి తక్కువచేశారా? గతప్రపంచ సంగ్రామంలోనేమి, నేటి 'ప్రపంచయుద్ధలోనేమి కాంగ్రెసువంటి మహాసంస్థ ప్రతికూల ప్రచారం చేస్తున్నా లక్ష్యపెట్టక యూరపురణరంగానికి వేలకొలదిగ దుమికి భారతీయరక్తాన్ని బలిదానం చేస్తున్నారే? గతసంగ్రామారంభమున బ్రతుకో చావో తేలే బెడిదపు సంగ్రామం తటస్థించింది. దుర్మతశిక్షార్థము మేము కత్తికట్టాము. సామ్రాజ్యప్రతిష్ఠాపరిస్థితి మీ చేతులోవుంది. గృహచ్ఛిద్రాలుమాని మీరు రణావనిం జొరబడిన నాడులోక శ్రేణులను గూడ పట్టి చల్లారుస్తామని మీ సహాయాన్నే నమ్మి మేము రణాంగణమున కురికినాము. ధర్మప్రతిష్ఠాసిద్ధాంతము చేయబూనినాము. రాజ్యక్షేమాన్ని కోరి మీరీ యుద్ధభారమును దాల్చండి. మనయభీష్టాన్ని ధర్మసేవాఫలంబే సాధించితీరుతుందనే లాయిడ్జార్జిగారి సందేశమును

శిరసావహించి తిరిగి యెప్పటికి వస్తారని తల్లులచేత నడిగించు కొన్ని త్రి పెండ్లి కూతుండ్రను విడచి మేము కూడా మీ వైను వెంట వస్తామని మూపున బెనంగెడి తొలికాపురపు రమణీ మణుల నేదో చెప్పి జోకొట్టి, ప్రసవించిన తర్వాత నైనా పోకూడ దాయని బ్రతిమాలుకొను నిండుచూలాండ్ర నూరడించి, ముం దడుగు వేయకుండా కాళ్ళు వేళ్ళబడి ప్రాకులాడు కసిగం డుల చేతులలో నింతమిఠాయిబెట్టి బుజ్జగించి భావరూఢమైన రాజభక్తిచే పుత్రమిత్రకళత్రాదులను, మాతృభూమిని త్యజించి ఖండన భూమికి దుమికిన సాంధ్రవీర యోధులు చూపిన యశశ్రీపరాక్రమ ప్రతిభ నెందరు పాశ్చాత్య దేశీయులు శ్లాఘించిరో మఱచిరా? నేటిసంగ్రామమున నాంధ్ర యోధు లు లేని రణాంగమున్నదా? అట్టివారి యీ స్వల్పకోరికను దీర్పలేరా?

ఇంతవఱకు ప్రత్యేకాంధ్రరాష్ట్రము రాకపోవుటకు హేతువేమి? అరవలు అడ్డు తగులుచున్నారనే మిష చెప్పుట ధర్మమా? కంచెయే చేనుమేసిన దిక్కేమి? ఆంధ్రుల ఆదా యాన్ని యితరులకై వ్యయించుట ధర్మమా? వేళ్ళమీద లెక్క పెట్టగలిగినంత జనాభామాత్రము కలిగి, కనుచూపుమేరకైనా కనపడని భూపరిణామంతో నొప్పారు తోటిబర్మా ప్రజలు పదేండ్లకింద టే ప్రత్యేకరాష్ట్రాన్ని సంపాదించుకొన్నారే. పైగా ఆంధ్రదేశంలోని కొంతభాగాన్ని కూడా యిదివరకే దిగ

మ్రింగి యింకాకొంత మ్రింగ జూచుచున్నారే? ఆంధ్రులకిది తలవంపుగాదా? ఆంధ్రులారా! మేలుకొనుడు. తెలుగువారు వట్టి దద్దమ్మలని పరిహసింపబడకుడు. ఆంధ్రరాష్ట్రసంపాదనకై ఆందోళన చేయుడు. మీకోరికి ప్పుడుగాక పోయినా గొన్నాళ్ళకు తీరకమానదు. అరవసోదరుల కుట్రలికెన్నాళ్ళో సాగవు. ఒరిస్సావారు మ్రింగగా మిగిలిన దానిలోగొంత అరవవారు మ్రింగజూచుచున్నారు. వారాంధ్రదేశమంతటాఅన్నవిక్రయా దినెపమున అలుముకొని యున్నారు. మనమందర మేకదీక్షతో పనిజేసిన కుట్రదారుల పన్నాగాలు సాగనేరవు. మదరాసు గవర్నరుగారి సమక్షాన శాసనసభలో సుముఖముగా తీర్మానింపబడిన ఆంధ్రరాష్ట్ర సమస్యాప్రకటన బహిరంగమునకు వచ్చేసరికి వట్టి తెల్లకాగితమై పోవడం మన దురదృష్టం,

ప్రకాశంపంతులువంటి రాజకీయవేత్తలు భాషాసేవకులు, దేశాభిమానాలు, కార్యశూరులు కూడ మూకీభావం వహించడానికి కారణమేమి? శక్తిహీనతయా? కాదు వారందరపుడు తమదృష్టిని భారతదేశ దాస్యవిమోచనపై కేంద్రీకరింపబడ జేశారు దానిని సాధించడానికి కొద్దిరోజులలో నాంధ్ర నాయకులు కారాగారము నుండి ముక్తులై నడుంకడతారు. అప్పుడు ప్రకాశపంతులు తడాఖా చూడనచ్చును. మన పంతులధైర్యసాహసా లసమానాలు. 1918 లో ప్రథమ ఐరోపామహాసంగ్రామం ముగిసింది అందుభారతీయులు,అందు

ముఖ్యముగా ఆంధ్రులు ప్రతిరాష్ట్రమునకూడ ప్రజాప్రతినిధిత్వ ప్రాచ్యరాజ్యాంగపద్ధతికై పోరెడుకాలమున స్వార్థత్యాగమైన ర్భటానికై వితతప్రాణధనంబులనుతృణముగా వెచ్చించిసామ్రాజ్యసంస్థను కాపాడారు. ఇంకా రెండేండ్లు నిండకమునుపే, ఋణము లొనర్చి కూడ వారుఘంటుగా నిచ్చినచేతకిఆరలేదు. ఆరణసవనంబునం దసురకదంబమును ప్రేల్చిన వీరసైనికాగ్రణుల కళత్రబాంధవపరంపరశోకము లార లేదు. అకారణముగ 1920వ సంవత్సరంలో దొంతనము వారు మాంటేగ్ ఛేమ్సుఫర్డు సంస్కరణములను అమలులోనికి దెచ్చిరి. ఆవిషయమున దొరతనమును ప్రజలు సయోముఖిపకుంభసుచిరి ఆసమయమున నాంధ్రనాయకుడైన ప్రకాశంపంతులు ఆసంస్కరణములను తనవాగ్ధోరణిచేతను చాకచక్యముచేతను ప్రతిఘటించి యసమానధైర్యమునుచూపి యశోవిశాలి యనిపించుకొన్నాడు.

ప్రకాశంపంతులు ప్రకృతిచాలనిర్దోషయుతము, నిర్మొగమాటము, నిష్పక్షపాతము గలదిగనుండును. ఇతరులను పొగడి కార్యమును సాధించుట, ఆశ్రయించుట, అనునవి యతనిప్రక్కకు జేరవు. ఇంక ఉపన్యాసవేదికపై కెక్కి తనవాగమృతమును ప్రజల కందించుటలో కడుదిట్ట. రాజగోపాలాచారి మొదలైన దేశనాయకుల ఉపన్యాసములవలె ప్రకాశంగారి ఉపన్యాసములు హాస్యరసపూరితములుగా నుండవు. కానిభావోద్రేకముగా గంభీరంగా సూటిగా ఆయన ఉపన్యాసంహృదయఫలకంలో నాటుకుపోతుంది. పాశ్చాత్యప్రము

ఖుడైన లిమాక్ట్రూ టెక్కీవలె ప్రకాశంగారిలో మేధాశక్తి వ్యక్తిత్వం అపారంగావున్నాయి. కలియుగప్రభావమో ఏమో గాని అనుకునాలే అతన్ని పాడుచేస్తున్నాయి. సత్యమార్గం కలియుగంలో కంటకావృతంకాబోలు. ఇతరులనుపొగడి తన వంకకు లాక్కొనే మోసగింపు స్వభావ మాతనికి లేదు. కుండ బద్దలగొట్టినట్లు మాట్లాడతాడు. అందుచేతనే అతడు బంధు మిత్రకోటికి విరోధిలవుచు న్నుంటాడు. దీనంతకీముఖ్యకారణం పరివిద్యామోహం లేకపోవడమేనని కొందరిపెద్దలఆశయం.

ఇక మహాత్ము డాదేశించిన సహాయ నిరాకరణోద్యమంలో దక్షిణాదిని ముందడుగు వేసి ప్రథమ తాంబూలంపుచ్చు కున్న శూరుడు ప్రకాశంపంతులు. ఆంధ్రులాంటి శూరులనే అపవాదాన్ని ఖండఖండాలుగా చేసిన నిశ్చలచిత్తుడు కావుననే నేటివరకూ ఆతాటిమీదనే నిలబడ్డాడు. కొందరు కాంగ్రెసు ప్రచారకులవలె యేమెండకాగొడుగుపట్టే స్వార్థపరుడు, బుర ఖూరాయుడు గాడు. మలబారులో మోపలాతిరుగుబాటుజరుగు నప్పుడు పోలీసులు కారిపట్లచేసిన దౌర్జన్యాన్నిచూచి యీ దేశంలో పెద్దలంతా ... నిశ్చేష్టులైఉండిరుకొంటే మన ప్రకాశంపంతులు లాహులో కలుగ ... సుకొని పోలీసువారి అక్రమ చర్యను, దొరతనమువారి ఉపేక్షను తీవ్రంగా ఖండించినాడు. అందుచేతనే ... లో నేటికీ ప్రకాశంగారి మాటవస్తే యీ దేశీయులు చేయెత్తి మొక్కుతారు.

సాధారణంగా ప్రపంచపీఠులని పేరుపడ్డప్రతివారూ కూడా తమహృదయభావాలను ప్రజాబాహుళ్యానికి తెలపడం కోసం పత్రికానిర్వహణకార్యభారం వహించడం మనము చూస్తూనేయున్నాము. అట్లే మన ప్రకాశంపంతులుకుకూడా పత్రికానిర్వహణోద్దేశం కలిగింది. వెంటనే కార్యదీక్షవహించి యొకపత్రికను ప్రారంభించాడు. అయితే ఆపత్రిక రాజకీయ భాషలోనే వెలువరించాలని సంకల్పమాయనకు. మదరాసు రాజధాని యంతటిలోను ప్రఖ్యాతినొందినది. హిందూపత్రిక తెనుగువారి కెవ్విధమయిన ప్రోత్సాహమును చేయకపోవడమే కాకుండా పైగా తెనుగువారికి శకటోపం పెడుతున్న విషయాన్ని నాడో మిగులసూక్ష్మంగా గ్రహించాడు. తెనుగు దేశం వినా జిల్లాలంటే రాజభాషలోనే పత్రిక ఉండితీరాలి. దాంస్కై తన సర్వశక్తులను వినియోగించి "స్వరాజ్య" అనే పేరుతో నొక యింగ్లీషుపత్రిక నచిరకాలంలో వెలువరించాడు.

1921 వ సం॥రంలో నవంబరు నెలలో మొదటిసంచిక వెలువడింది. కాని కొన్నికారణములచేత ఆపత్రికాప్రతిపై పరిపూర్ణశ్రద్ధతీసుకొనడానికి నావకాశం కుదరలేదు. ఆసంవత్సరంలోనే జాతీయజీవితాలోకనలమునకు ప్రథమచక్రంగావున్న గుంటూరుమండలములో పంతులుగారి నాయకిత్వంక్రింద పన్నులనిరాకరించుట ప్రారంభమై తీవ్రతరరూపందాల్చింది. ఆసమయానికి గుంటూరుజిల్లాకు నిన్న మొన్నటిదాకా పుష

రాసుగవర్నరుగారికి ఎగ్జ్యైజరుగానుండి. నేను బీహారురాష్ట్రి మునకు గవర్నరుగానున్న రూథర్ ఫర్డు జిల్లాకలెక్టరుగానున్నా డు. ఆయన తెనుగుదేశంలో విశాఖపట్నంజిల్లా మొదలగు కొన్ని జిల్లాలలో డిస్ట్రిక్టుకలెక్టరుగా చాలాకాలం పనిచేశాడు. మంచిపట్టుదలకలవాడు. ఆయన పన్నులనిరాకరణోద్యమసం దర్భంలో సామదానభేదోపాయా లుపయోగించి చూచాడు. అసాధ్యంగా కనిపించింది. అంచేత దండనీతి నవలంబించినాడు

ఆసమయంలోనే ఉత్తరహిందుస్థానంలో చౌరాచౌరీ దురంతాలుజరిగాయి. దొరతనంవారు కాంగ్రెసువారిని విప రీతంగా పత్తిడిచేసి నానాబాధలు పెట్టారు. అందుచే మహా త్ముడు అసహాయోద్యమాన్ని ఉపసంహరించుకొన్నాడు. అయి నప్పటికీ ప్రభుత్వంవారా సందర్భంలో గాంధీమహాత్ముని అరెస్టుచేసి ఆరు సంవత్సరాలు శిక్షించారు. మహాత్ముడు కిక్కురుమనకుండా కారాగారంలో చిఱునవ్వుతో ప్రవేశిం చాడు. ఆవిషయాన్ని స్వయంగాచూచి వచ్చిన మనపత్రికాశం పంతులు తెనుగుదేశమంతటాసంచారంచేసి ప్రభుత్వదుర్నయా లను ఆంధ్రులలో ఆబాలగోపాలానికీ తనయుపన్యాసధురీవేగం బున స్పష్టంగ బోధపరిచాడు. ఆప్రచారసమయంలో నాతడు చూపిన యనుపత్రిమానమైన సహనశక్తికి ఆంధ్రులంతా ఆయ నకు బంగారు హారతులు పట్టారు. ఎక్కడికి వెడితే అక్కడ తెనుగువారు పూర్ణసహకారంతో బ్రహ్మరథంపట్టారు. ఆయన

పేరు తెనుగుదేశమందే గాక యితరప్రాంతాల్లో గూడా మారుమోగింది.

మఱిరెండేండ్లు కాలచక్రంలోకొచ్చాయి. అనగా 1923 జరుగుతోంది. ఈలోపున కాంగ్రెసుసంస్థయొక్క జీవశక్తిని ఆంధ్రులందరూ గ్రహించారు, కాంగ్రెసుసంస్థలో పని చేసే నాయకులలోకొంతమందికి పదవీవ్యామోహాసక్తత ప్రబలమైంది. దాన్నిగూర్చి ప్రతిచోటా చర్చలు నాగకుం ప్రారంభించాయి. కొందరునాయకులు లామాట యెత్తద్దన్నారు. కొందఱు మహాబాగావుందన్నారు. మఱికొందరు చంకలెగరేశారు ఏమైనా కాంగ్రెసు మహాసభలో ముఖాముఖిని చర్చలు జరిపి యిదమిత్థమని తేల్చుగోవలసిందే గాని వ్యక్తిపరంగా యీ విషయంలో ఎవరూ కూడా సాహసించడానికి, స్వాతంత్ర్యం చూపడానికి వీల్లేదనే యొకతీర్పవకొచ్చారు. అందులోను బెంగాలురాష్ట్రాని కప్పట్లో యువకనాయకుడైన సి. ఆర్ దాసు గారివిషయంలో చాలా పట్టుదల చూపడం మొదలెట్టాడు.

చిత్తరంజనదాసు చాలా నిర్మల హృదయుడు. దూర దృష్టి గలవాడు. విశాలభావసంపన్నుడు. అప్పట్లో ఆమహనీయుడు చేసిన త్యాగానికి, చూపిన ప్రజ్ఞకి, చేసిన ప్రచారానికి బెంగాలురాష్ట్ర ప్రజలాయన్ని దేవుడుగా తలుస్తున్నారు. 1923—20 ల మధ్య కాలంలో ఈవిభేదాలు పుట్టాయి. కాంగ్రెసుసంస్థకే నైకనాయకుడైన మహాత్మాగాంధీజీ యొక్క మాటను ధిక్కరించే శక్తిగలవారుగాని, ఆభావం కలవారుగాని

యొక్కరూలేరు అయితే ఒకరిని మించిన బుద్ధిమంతులు వే రొకరుండవచ్చును గదా. చిత్తరంజనదాసు బుద్ధి యీపంథా లోకి పోయింది. మారంగావుండి కార్యం సాధించేదాని కన్న చేతులు కలిపి సాధించినందు వల్లనే లాభమున్నదని ఆబెం గాలునాయకుని కాత్మవిశ్వాసం యేర్పడ్డది. దాంతో ఆయన తన ఆత్మవిశ్వాసాన్నే నమ్మి దానికిగాను స్వరాష్ట్రంలోనేకా కుండా అన్నిరాష్ట్రాలలోను ప్రచార మారంభించాడు.. అడ్డు తగిలిన వారికల్లా సమాధానాలు చెప్పాడు. ఏమైనా దీని పర్యవసానం మహాసభలోనే తేలాలని ప్రతివారూ అన్నారు. అదే సరియైన మార్గమని నిశ్చయానికి వచ్చారందరూను.

అసలుసంగతేమిటీ అంటే కేంద్రరాష్ట్రీయశాసన సభ లలో కాంగ్రెసువాదులు ప్రవేశించడమా, ప్రవేశించక పోవ డమా అని. దీనివల్ల యెంతేనా లాభమున్నదని కొందరి వాదన. ఏమిలాభంలేదని కొందరి ప్రతివాదన. 1923 సం॥ రం కాంగ్రెసుమహాసభలో యీవిషయాన్ని ప్రవేశపెట్టారు. చర్చలు విపరీతంగా జరిగాయి. అందులో సి. ఆర్. దాసు గారు మిగుల పట్టుదల వహించారు. మహాత్మా అంగీకారం చూపలేదు. ఆయనన్ని వొప్పించి తీరాలని దాసు పట్టుదల. దానితో రెండు చీలికలగా ఏర్పడ్డారు. ఒకటి దాసుపార్టీ రెం డవది గాంధీపక్షం. అప్పుడు వాదోపవాదాలుకి దిగొన్నారు. మహాత్ముడెంత ధాటి చూపితే అంతకంటె రెట్టింపుధాటిచూ పాడు దాసు. ఎంతసహనశక్తి గాంధీజీవెల్లడిస్తే అంతకన్నకొన్ని

రెట్లు ఓర్మిచూపాడుదాసు. అందులో ప్రకాశంపంతులు తీవ్రమైన వాదనచేశారు. అసలీతనికి పార్లమెంటరీ విధానంలోకించిత్తయినా నమ్మకంలేదు. తీర్మానం వోటుకుబెట్టారు. శాసనసభాప్రవేశంచేసి దాని నిజస్వరూపాన్ని ప్రజాబాహుళ్యానికి తెలియజేయాలనే ఆశయాన్ని చాలామంది వెలిబుచ్చారు. వ్యతిరేకంగా వోటుచేసినవారు అసహ్యించుకున్నారు. చీదరించుకున్నారు. గొణుక్కున్నారు. నెత్తిమీదటోపీలు క్రిందవేసికొట్టారు. ఏమేమో చేసారు. ఏమీలాభం లేకపోయింది. తుదకి యెక్కువవోట్లతో సి ఆర్. దాసుగారి ప్రతిపాదనే నెగ్గి కాంగ్రెసువారు శాసనసభా ప్రవేశం చెయ్యడానికి నిశ్చయంచేసారు.

ప్రకాశంపంతులుకు లోపల యెంతమాత్రము యిది యిష్టంలేదు. లేకపోయినా కాంగ్రెసునీతికి బద్ధుడై యెన్నికలకు ప్రచారమారంభించాడు. ఎక్కడచూస్తే అక్కడ సర్వత్ర తానయై మహాప్రచారాన్ని సాగించాడు. అప్పట్లో ఆయన కాంగ్రెసు సంస్థకు చేసినసేవ వర్ణనాతీతము. దానితో ప్రజలలో మహోత్సాహం బయలుదేరింది. అప్పటికి దేశంలో చాలాకాలంనుంచి పీఠంవేసుకొన్న యితరపార్టీలలో బలవంతమైనపార్టీ వొకటుంది, ఇంకాకొత్తపార్టీలు లేచాయి దానితోమరీ తీవ్రంగాపనిచెయ్యవలసివచ్చింది. కాంగ్రెసువారుశాసనసభలకునిలబడ్డారు. ప్రచారం అన్నిపక్షాలవారూ అతిదారుణంగా

మహాదీక్షతో చేస్తున్నారు. ఇప్పుడు కాంగ్రెసు నెగ్గిందీ అంటే, మననోట్లోబూడిది పడుతుందనే పార్టీవారు గజగజలాడి పోయారు.

అప్పటికి ప్రకాశంగారాంధ్రరాష్ట్రీయ సంఘాధ్యక్షులు ఎన్నికలసమయంలో సరైన నిద్రాహారాలను విసర్జించి ఎంత మాత్రమూ శక్తి నంచన లేకుండా వంచిన నడుమెత్తకుండా, 24 గంటలూ ఒక్క నిమిషమేనా తీరుబాటులేకుండా ఉపన్యా సవేదిక మీదనిలబడి మాటలాడేవారు. రాత్రింబవళ్ళు కారు లోనే కాపరంపెట్టారు. ఆసమయంలోప్రభుత్వ మాయనకు 144 వ శెక్షనుజారీచేసి నోరుకట్టేయప్రయత్నించింది. దానినే మాత్రమూ లెక్క చెయ్యకుండా ఉల్లంఘించాడు. అట్లుచేసినా చూసీచూడనట్లు ప్రభుత్వంవూరుకుంది. పిరికితనమనేది ఆయ నకువకోశానా లేనేలేదు. ఆఎన్నికలలో నతడెన్నడు సొంత కాణ స్థిట్యుయన్సిలో తిరగలేదు. తనకు ఓటివ్మని యేవ్యక్తినీ అడుగలేదు. ఆయనకు ప్రత్యర్థి సర్ మోచర్ల రామచంద్ర రావుపంతులు. ఆయనకూడా దేశంలో పేరుపొందిన న్యాయ వాది. గొప్ప రాజకీయవేత్త. ధర్మపరుడు; అట్టి వ్యక్తిని 11 వేల ఓట్ల మెజారిటీతో ఓడించాడు. కేంద్రశాసనసభలో సభ్యుడై నాడు. ఒక్క కాంగ్రెసు సంస్థేగాదు. దేశంలోవున్న అన్ని పక్షాలలోని నాయకులూ విస్తుపోయారు.

ఆవిజయసందర్భంలో ప్రకాశంపంతుల్ని మెచ్చుకొన్న వారనేకు లున్నారు. అందు ముఖ్యమైన స్తుతిపాఠాన్ని ఒక్క

. దాన్నిమాత్రమే ఉదహరిస్తున్నాము. ఢిల్లీలో హిందుస్తాన్ టైమ్సుపత్రికావిలేఖరి "వెరిటాస్" అనే ప్రముఖుడు ఇట్లా ప్రశంసించాడు. "హిందూదేశ సంస్థానాలలోను యిలాంటి విజయం లేదు ప్రకాశం తెనుగుభూగానికి జీనగ్ర, కిరీటంలేని రాజు.

ప్రకాశంపంతులు తెంతటి మహాకార్యంలో మునిగి వున్నా గ్రంథపఠనం మాత్రం మానడు, అది యతని నిత్య కార్యక్రమంలో ఒకసూత్రమేమి. ఢిల్లీ శాసనసభలో సభ్యుడుగా వున్నప్పుడు గ్రంథాలయంలో గ్రంథపఠనం నిత్యకృత్యంగా పెట్టుకున్నాడు. చదివినదాన్ని మననంచేసుకొని ముందువెనుకలు చూసుకుంటూ ఏమాత్రం గుణాగుణాలు కనుపించినా వాటిని వెల్లడిచేయడ మతనిస్వభావం? దోషాల నెట్లుఖండించు తాడో గుణాల నంతకన్న పదిరెట్లుమెచ్చుకొంటాడు. క్రిటిజిజం అంటే నాలుక కోసుకుంటాడు.. దానికితగిన ప్రజ్ఞాఉంది - గ్రహణశక్తీ ఉంది.

ఆరోజులలో ప్రకటింపబడిన కృష్ణాగోదావరి రీసెటిల్ మెంటు రిపోర్టు క్షుణ్ణంగాచదివి అవగాహనచేసుకున్నాడు. ఆందుమీద ఘాటైన విమర్శనలు వెలువరించాడు. అంతటి నుండి యతని దృక్పథము కేవలం రివిన్యూవ్యవహారక్రమము మీదికి లంఘించేని. రివిన్యూవిషయం ఏదేనా సదస్సులో వచ్చిందంటే దానిమీద ఘాటుగామాట్లాడడం అతనికినైజమై పోయింది.

దేశసంచారం చెయ్యడమంటే యతని కత్తికులాసా. సాధారణంగా యీపనికి ఎగబడేవారు తక్కువగా వుంటారు. అదీగాక దీనికెన్నో అడ్డంకులు కనిపిస్తాయి. అందులోను సత్యాన్వేషణకై దేశసంచారంచేసేవారీకాలంలో చాలఅరుదు. అతని కల్లాటివేమీ లేవు. ఫలానిచోటికి వెళ్ళాలని బుద్ధికలిగిందంటే 'లేడికి లేచిందే పరుగు' అన్నట్లే బయలుదేరుతాడు. ఆర్భాటమేమీ ఉండదు చాలకష్టంగా ప్రయాణమవుతాడు. ఉన్నంతలో సర్దుకుంటాడు. చాలినంతలో సంతృప్తిపడతాడు. ఇది మానవులకి తీవ్రమైన సంకల్పశక్తి.

ఇదివరలోనే అతను యూరపంతా చుట్టివచ్చాడు. కేంద్రశాసనసభలో సభ్యుడుగావున్నరోజులలో బర్మా, మలయా, సింగపూర్, సయాం, జావా, సుమిత్రా, సిలోను, మొదలగు ప్రదేశాలను చూడబోయినాడు. ఆయాప్రదేశాలలో రబ్బరు, కాఫీ తోటలలో పనిచేసే కార్మికకర్షకుల జీవితాలను తిలకించి, వారికష్టసుఖములను పరిశీలించి, వారికి తోడ్పడమాటయిచ్చి, తిరిగి స్వదేశానికివచ్చి, వారికచేయగలిగినంత చేశాడు. అంతతో పంతులుగారి ప్రపంచయాత్ర సమాప్తినందినది. ఆయన మొత్తంమీద నొక్క అమెరికాతప్ప ప్రపంచమంతా తిరిగివచ్చినాడు. ఆసంచారం కార్యక్రమంవలన నెంతో విజ్ఞాన మార్జించాడు

ఇట్లుండగా 1928సంవత్సరములో మన దేశపరిస్థితులు పరికించి, ఏమేమో చేయనుంకించి, కావలసినంత ధనవ్యయ

మొనర్చి మనల నుద్ధరిస్తామని సైమన్ కమీషన్ ఒకటివచ్చింది. దీనికి 'సైమన్' అనేఆయన పెండేసిబద్ధగా వుండడంచేత ఆపేరు పెట్టారు. కాంగ్రెసువారు "ఈసైమన్‌కమిషన్ వచ్చి మన కొరగదోసేదేమీలేదని, ఇదంతా నట్టిబూటకమని, మనకళ్ళ నీళ్ళు తుడవడానికి పన్నినపన్నాగమని ముందేగ్రహించి యుం డడంచేత దానిని బహిష్కరింప నిశ్చయించుకున్నారు.

అప్పటికి ప్రకాశంపంతులు ఆధ్రకాంగ్రెసున కధ్య క్షుడు. మదరాసులో నున్నారు. సైమన్‌కమీషనక్కడికే విచ్చేస్తోంది. దొరతనమువారు చాలధనము ఖర్చుపెట్టి ఆర్భా టాలు చేస్తూన్నారు. మేము సైమన్ కమీషనును బహిష్క రిస్తామని కాంగ్రెసు ముందుగానే తెలియజేసింది. అందుకు తగిన సన్నాహాలన్నీ ప్రకాశంగారు స్వయంగా సిద్ధం చేశారు. కమీషన్ వచ్చిన రోజున తమ అసమ్మతిని తెలువుతూ నల్ల జెండాలతో ప్రదర్శనం చేశారు.

ఆసందర్భంలో ప్రభుత్వంవారు కేవలదురభిమానానికి వడబడి మూకమూకలుగా చేరి బహిష్కార కార్యక్రమం సాగించే ప్రజలను తఱుమగొట్ట యత్నాలు చేశారు. జనులే మాత్రము నదురుబెదురు లేకుండా నిలబడ్డారు. అన్నివిధాలా దొరతనంవారికి తలవంపుగా వుంది. అయితే ముందు వెనుక లాలోచించకుండా ప్రభుత్వం ప్రజలను తీవ్రదండనకు గురి జేయుతలంపుతో ప్రజలను భయపెట్టడానికనే నెపంమీద తుపాకులు కాల్చారు. ఆకాల్పులువల్ల చాలామందికిగాయాలు

తగిలాయి. ఒకడు చనిపోయాడు, ఆ శవాన్ని చూడటానికి ప్రజలు నదీవెల్లువలా తండోపతండాలుగా వచ్చేస్తున్నారు. ఆ హడావిడిమాచి ప్రభుత్వం ఆ శవాన్ని దాచేసింది. శవాన్ని చూడడానికి వీలులేదని ఎవరేనామిడిసి పడితోసుకొనివస్తే కాలుస్తామని అంకెలు వేసింది.

ఆసమయంలో ప్రకాశంపంతులుకు ప్రజలకోరిక తీరవలసిందే అని తోచింది. వెంటనే నడుముకట్టారు. తప్పక ప్రజల కోర్కెతీర్చి తీరాలనే పట్టుదలతో తాను ముందుకువచ్చి, నేను శవాన్ని చూడాలి, తోడిసోదరులందరూ యిదే కోరుచున్నారు. ప్రభుత్వం వారడ్డగింపరాదు. అనిచెపుతూనే కొలది ప్రజలను వెంటబెట్టుకొని లోనికి వెళ్ళనుంకించారు. సాయుధులైన సైనికులు అడ్డు తగిలారు. అతిడెంతమాత్రం లక్ష్యంచేయక ప్రకాశంగుండె కాల్చుకున్నాసరే. లేదా నావెంటవచ్చినవారికి శవాన్ని చూపినాసరే యని సైనికులమధ్యనుంచి ధీమాగా త్రోసుకొని లోపలి కెళ్ళారు. ఆమాటవినేసరికి ప్రభుత్వమే విస్తుపోయిందంటే సాయుధసైనికుల సంగతి చెప్పాలా? సైనికులు నిర్విణ్ణులై ప్రక్కకు తప్పుకున్నారు. ప్రకాశంగారి గుండె ధైర్య మెల్లాటిదో గమనించారా?

ఆయన దేనిని చేయబూనినా దానికంటా చూసితీరుతారు. అటో ఇటో తేలవలసిందే. 1931లో మహాత్ముడు ఉప్పుసత్యాగ్రహోద్యమమును పూరింపవలసివచ్చి ప్రారం

చారు. ఆసమయానికి ఇంట్లో ఇల్లాలు, చిన్నవయసు వారైన పిల్లలు శరీరానారోగ్యం చెడియున్నారు. వదియెట్లా వున్నా సరేయని, సర్వమూ త్యజించి జయపరమేశ్వరాయని సత్యాగ్రహరణరంగమున దుమికినాడు తన స్వగ్రామమగు దేవరంపాడులో సత్యాగ్రహంచేసి ప్రభుత్వముచే సంవత్సరం శిక్షింపబడ్డాడు. 1932 లో కళత్రవియోగం జరిగింది.

ఆసంవత్సరంలోనే గాంధీ ఇర్విన్ ఒడంబడిక జరిగింది దానిప్రకార మాయన శిక్షాకాలమింకా పూర్తి గాకుండగానే కారాగారమునుండి విడువబడ్డాడు. జైలునుంచి రాగానే ఆయనకీప్రపంచమంతా అంధకారబంధురమైపోయింది అర్ధాంగి చావుమూలకంగా అయినా యేమీ కంగారుపడలేదు. — తిక మకలుచెందలేదు— బెంబేలుపడలేదు. నిలదొక్కుకున్నాడు. ఋణానుబంధం — అన్నాడు — ఇపుడు మనకర్తవ్యమేమని తీవ్రంగా ఆలోచించగా తిరిగిపత్రికాప్రతికను బహిరంగపరచడమే విధ్యుక్తధర్మమని తోచింది దాంతో తిరిగి స్వరాజ్య పత్రికాప్రచురణ మారంభించినాడు.

ఆపత్రికా ప్రచురణముకూడ ఎంతోకాలము జరుగలేదు. మనలను సుమారు నూటడెబ్బయేండ్ల నుంచి పరిపాలిస్తూ, మనతో చేతునుకలపి, మనవలన సహకారం పొందుతూ — అన్నివిధాలా మిమ్మల్ని బాగుచెయడానికేయత్నిస్తున్నామనే ప్రభుత్వంమాత్రము—మనకత్యవసరాలు వచ్చినప్పుడు మన్ని దూరంగానే వుంచుతోంది—తెల్ల—నల్ల అంటోంది. మనుష్యుష్యం

వచ్చినట్లుగా...మన దేశీయప్రజలకు మనమనోభావాలను వెలు పుకోడానిని వీల్లేదు. ఇలాంటివెన్నో ఉన్నాయి. అందుముఖ్యంగా పత్రికాప్రచురణవిషయంలో భారతదేశానికికొన్ని కట్టుబాట్లే ర్పరచి శాసించారు. అందులో వీసమంత తేడావచ్చిందంటే ఆ పత్రికాప్రచురణము నిలుపుదుచేస్తారు. ఆలాగే స్వరాజ్య పత్రిక నేదో నెపంపెట్టి కొద్దికాలంలోనే అపుచేశారు. ప్రెస్ ఆర్డినెన్సు క్రింద నిషేధించారన్నమాట.

ప్రకాశంగారు తనపత్రికా భవననిర్మాణయత్నంపూర్తి చేసుకున్న సమయంలో పత్రికను నిషేధించిన ఆజ్ఞ వచ్చిందని తెలియడంతోటే ఆయనహృదయం బీటలువారింది. 1937లో జరిగిన ఎన్నికలలో తీవ్రప్రచారం సలిపినాడు. దానికా ప్రజానీకంమెచ్చి "ఆంధ్రకేసరి" అను బిరుదునిచ్చింది. అతని తీవ్రప్రచారంవల్ల కాంగ్రెసుకు మహావిజయము చేకూరింది. అనంతరమన్ని రాష్ట్రాలలోను కాంగ్రెసు అధికారాలు స్వీక రింపనిశ్చయించింది. దొరతనం విధిలేక తలవాల్చింది. మద రాసురాష్ట్రంలో ఏర్పాటైన మంత్రివర్గానికి తమిళనాయకు లును, పదవీవ్యామోహవాంఛాతత్పరులును, రాజకీయ నేత్రలు నైన రాజగోపాలాచారిగారు ప్రధానమంత్రిత్వ మలంకరిం చారు. అందులో ప్రకాశంగారు రివిన్యూమంత్రిపదవి నందారు. జమీందారీ రైతురక్షణకై జమీందారీబిల్లు ఆయన తయారు చేసి శాసనసభలో పెట్టాడు. అటురైతువర్గాలు ఇటుజమీం దారులూ కూడా ఆంగీకరించి ఆయన్ని వేనోళ్ళ శ్లాఘించారు

అయితే లాభమేమిటి? రాజగోపాలాచారి గారికి అనుగ్రహింకలుగలేదు. పైగా యీబిల్లును ప్యాసుచేసి అమల్లోకి తీసుకువచ్చామంటె ప్రకాశంపంతులికి వచ్చేకీర్తి ప్రతిష్టలుపట్ల పగ్గాలుండవనిఅసూయాపరవశుడై దానికనేకఅడ్డంకులుగల్పించి ఆయనకు ఘనతవస్తే తన కేదో చేటు మూడుతుందని దురుద్దేశంతో గాంధీవియ్యంకుడైన రాజగోపాలాచారి దానికిశకకోపం పెట్టాడు. ప్రపంచంలో అసూయాగ్రస్తుడు చేయరాని కార్యమొకటి యుండదుగదా! అసూయాపరునకు మంచి చెడ్డలుండవుగదా?

సత్యాగ్రహము—ఉపసంహారము

కాలమొక్క రీతి నుండదుగదా? ఇంతట్లోకే ద్వితీయ ప్రపంచసంగ్రామారంభంరాగానే ప్రభుత్వంవారికి కాంగ్రెస్సుకు ఏవోవిభేదాలు రావడంచేత 1940 లో కాంగ్రెస్సు నాయకులు మంత్రిపదవులకు రాజీనామాలిచ్చారు. దానికి మిక్కిలిగా ప్రోత్సహించినవారు మనప్రకాశంపంతులే. మళ్ళీ గవర్నర్లస్వపరిపాలన మారంభమైంది. కాంగ్రెసుపరిపాలనలో వారుదేశానికేమైనా ఉపకారం చేస్తారా అని ఎవరేనా అడగవచ్చును. చేసిందేదో చేసారు. కాని అసలే చెయ్యకపోలేదు మద్యపాన నిషేధాదిశాసనాలేవో కొన్ని చేసి తంటాలుపడుతున్నారు. కాని ప్రజాబాహుళ్యంలో కొంతమందికి కష్టాలు కలిగించే అమ్మకాలపన్నుచట్టము, పోగాకుచట్టమునూతమను పైకి కనుపిస్తాయి. కాని యిల్లాటివి సహజమే.

ఏదేశా యొక్క కార్యభారాన్ని నెత్తిమీద పెట్టుకున్నప్పుడు మంచీచెడ్డాకూడా చెయ్యవలసివస్తుంది. మంచిచేసినందుకు చంకలెగరేసి చెడ్డచెయ్యడంతోనే బూతులపంచాంగం విప్పకూడదు. దాని నలావుంచండి అంతలోకే సత్యాగ్రహం తప్పకుండా చెయ్యవలసివచ్చింది. మదరాసులో ముందుగా సత్యాగ్రహంచేసినవారు మనపంతులే. తర్వాత ఆగస్టుతీర్మానాన్ననుసరించి గాంధిప్రభృతులను, వారి యనుచరులనూ కూడా ప్రభుత్వం నిర్బంధించింది. ప్రకాశంపంతుల్ని ఇతర నాయకులుకూడా తిరుచునాపల్లి కారాగారంలోనుంచారు. ఆ చెరసాలలోయున్నప్పుడుతను గోళ్ళుగిల్లుకుంటూ కూర్చోకుండ భగవద్గీతకు వ్యాఖ్యానము, ఆత్మకథవ్రాసి గ్రంథకర్త అనుపించుకున్నారు. తరువాతతనదృష్టిని గ్రామపునిర్మాణంమీదకు మరలించి గ్రామస్వరాజ్యమనే పత్రికను స్థాపించారు గ్రామసీమలను బాగుపరచటమే ముఖ్యంగా పెట్టుకున్న కాంగ్రెసు నాయకులు పదేపదే తమయనుచరులను, విద్యార్థులను న్యాయవాదులను తీరుబడిసమయంలో గ్రామసేవ చెయ్యవలసినదిగా ఉద్బోధిస్తున్నారు. గ్రామసీమలవంక కొంతమంది నుళ్ళుముఖం పడితే పట్టణాలుకూడా బాగుపడతాయి.

ప్రకాశంపంతులుగారివంటి త్యాగధనులనుగన్న భారతమాత ధన్యురాలు.

సమాప్తము.

శ్రీ శారదాప్రెస్. భట్లపల్లి అమలాపురంతాలూకా తూ.గో.జిల్లా. ఓ.81

# జాతీయ నాయకుల జీవితములు

రచయిత: కోటమర్తి చిన రఘుపతిరావుగారు.

## ౧ సంపుటము
## నాయకుల వివరము

1 శ్రీ దేశోద్ధారక, విశ్వదాత, కళాప్రపూర్ణ, స్వర్గీయ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు

2 డాక్టర్: భోగరాజు పట్టాభిసీతారామయ్య గారు

3 దేశభక్త: కొండా వెంకటప్పయ్య పంతులు గారు

4 డాక్టర్: ఎల్లమిల్లి జగన్నశాస్త్రి గారు

5 డాక్టర్; స్వర్గీయ బ్రహ్మజోస్యుల సుబ్రహ్మణ్యం గారు

## ౨ సంపుటము

1 శ్రీ మహర్షి బులుసు సాంబమూర్తి గారు

2 శ్రీ ఆంధ్ర కేసరి టంగుటూరి ప్రకాశం పంతులుగారు

3 శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు గారు

4 శ్రీ మొసలగంటి తిరుమలరావు గారు (M. L. A.)

5 శ్రీ మల్లిపూడి పళ్ళంరాజు గారు

వలయువారు:—

పసుపులేటి బాపిరాజు,
రాజమండ్రి.



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA131B161 |
| పుస్తకం పేరు | ఆంధ్ర కేశరి ప్రకాశం జీవిత చరిత్రము |
| తారీఖు | 30/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | YES |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | BCI |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Rehana |
| పేజీలు విడదీసినది | RukSana |
| స్కాన్ చేసినది | Ch. Ramya |
| పరీక్ష చేసినది | THASIN |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | |